ప్రఖ్యాత రచయిత్రి కోడూరి కౌసల్యాదేవి రచన —
సిద్ధహస్తుడైన శిల్పి ఆచార్య ఆత్రేయ సంభాషణలు
ఉజ్జ్వల నటవర్గం నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, సావిత్రి, జానకి -
చేసిన మహోజ్జ్వల రూపచిత్రణ



అన్నపూర్ణా వారి

# డాక్టర్ చక్రవర్తి

నిర్మాత డి. మధుసూదనరావు B.A. ❋ దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు



సంగీతం. ఎస్. రాజేశ్వరరావు ❋ నిర్మాణం. శ్రీ సారథీ స్టూడియోస్ (హైదరాబాద్) ❋ నవయుగ విడుదల

# ఉత్తరాలు

### ముఖచిత్రం

ముఖ చిత్రంపైన "నెహ్రూ సంఘటనలకు" బదులు "17 ఏళ్ళ కుర్రాడికి కాన్సు" అని వేసి యుంటే పత్రికలు ఇంకను ఎక్కువగా అమ్ముడయియుండేవి. ఈ వార్త మనకేకాదు యావత్ ప్రపంచమునకు ఆశ్చర్యకరమే. 17 ఏళ్ళ అబ్బాయి ఏమిటి? అతనికి కాన్సు ఏమిటి?

శ్యామ్‌సుందరరావు (చిత్తూరు)

### కథ

"జాట్‌హసాన్" చాలా చక్కగా ఉన్నది. ఈ కథ నన్నెంతో ఆకర్షించినది. రచన క్రొత్త పంథాలో సాగినది. ఇంత చక్కని రచనను మా (ఆంధ్ర పత్రిక పాఠకులకు) కందించిన శ్రీమతి శార్వాణి గారికి నా అభినందనలు.

ఎ. సౌదామిని (గూడూరు)

### సీరియల్ కథ

రంగనాయకమ్మగారి నవల కూలిన గోడలు ఇంతవరకూ కథ సాగకుండా అనవసర పాత్రలతో విసుగు కల్గించారు. కాని ఇప్పుడిప్పుడు చురుగ్గా సాగుతూ పతాకా సన్నివేశాన్ని అందుకొంటోంది. చిన్నవాడయినా మధు పాత్రకు జీవంపోసి పాఠకుల కళ్ళముందు నిలబెట్టగల్గారు రచయిత్రి.

ముద్దా చిట్టిబాబుగారి కార్యసిద్ధి కథలు వినోదంగా ఉన్నాయి. ఒక చిన్న సందేహం. ఆమధ్య మీరు ప్రచురించిన కాశీపట్నం వ్యాస రచయిత, కార్యసిద్ధి రచయిత ఒకరేనా? దయచేసి తెల్ప ప్రార్థన.

శ్రీమతి వి. జయప్రదా ప్రసాద్, జి. సాయిబాబు
వి. వెంకటనారాయణ (హుషంగాబాద్)

* ఒకరే.

### జన్మదినఫలం

జన్మదినఫలం సంఖ్యా శాస్త్రమును తత్కాల గ్రహ పరిస్థితిని అనుసరించి వ్రాయబడుచున్నది. అందుచే ఇది ఒక నక్షత్రమువారికిగాని, ఒక రాశి వారికిగాని పరిమితముగాదు. ఈ ఫలం ఈ జన్మదినం లగాయతు ఒక సంవత్సరంవరకూ అనగా వచ్చే సంవత్సరంలో వచ్చే జన్మదినంవరకూ అన్వయించును. ఉదా— 1964 ఆగస్టు 1 జన్మదిన ఫలం, ఏ సంవత్సరంలోనైనా ఆగస్టు 1వ తారీఖున జన్మించినవారికి, నక్షత్రముతోగాని, రాశితోగాని నిమిత్తంలేకుండా అందరికి వర్తించును. దానికాలం పరిమితి 1964 ఆగస్టు 1 లగాయతు 1965 జూలై 31 వరకు.

జన్మదినఫలం చూసికొనే విధానం తెలియజేయవలసిందిగా పాఠకులవద్దనుంచి చాలా ఉత్తరములు వచ్చుచున్నవి. విడిగా ఉత్తరముల ద్వారా తెలియపర్చుటకంటే పత్రికద్వారా తెలియపరచటం అందరకూ ఉపయోగపడును గాన ఈవిధముగా తెలియజేయడమైనది.

మహేష్ (మద్రాసు)

## ఆంధ్రసచిత్రవారపత్రిక

## రానున్న సంచికల్లోని కొన్ని ఆకర్షణలు!

•

కొత్త సీరియల్

## 'హృదయ కుసుమాలు'

**14-8-'64 సంచికలో ప్రారంభం!**

•

**21-8-'64 సంచికలో**

## వరలక్ష్మీ వ్రతం: గరుడపంచమి

చిన్న సచిత్ర వ్యాసం!

•

త్వరలో ప్రారంభం!

మీకు దెయ్యాల నమ్మకం వుందా?
లేకపోయినా ఆశ్చర్యపోతారు!

## 'నేను సైతాన్ చేతుల్లో బానిసను'

యదార్థ విచిత్ర గాథ!

•

## శాస్త్ర విజ్ఞానం

ప్రత్యేక సచిత్ర శీర్షిక

•

## ఢిల్లీలో నైట్ క్లబ్‌లు!

ఫొటోలు ప్రత్యేకం!





అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే

# టీ

సాటిలేని టీ!

టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైన దేముంది! ఇందుకు కారణాలు:—

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** టీ త్రాగండి; ఆనందము అందుకోండి!

ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
ఖిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్—నారింజ రంగు ప్యాకెట్
షాన్—పీలి రంగు ప్యాకెట్



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 31—7—'64
క్రోధినామ సం॥ ఆషాఢ మాసం బ॥ సప్తమి
సంపుటము 56 సంచిక : 48

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"గృహదహనకాండలకి కమ్యూనిస్టులు పూనుకున్నారూ అంటే వాళ్ళు పిచ్చివాళ్ళంటాను."
"అహా! వైఫల్యంవల్ల వచ్చిన పిచ్చి అది!"

## మనలో మాట

8 వ పేజీలో రచయితల కొక శుభవార్త ఉంది! మాకు తెలిసినంతవరకు తెనుగు కథకు దీపావళి కథల పోటీలో 900 రూపాయిల ప్రథమబహుమతి ఇవ్వపూనుకోడం ఇదేమొదటిసారి. రచయితలకిది చాలినంత ప్రోత్సాహమిస్తుందని యీసారి పోటీలో యిదివరకు కన్నా అధికంగా పాల్గొని తద్వారా 'మంచి కథ'లను పాఠకులకు అందించగల అవకాశం మాకు యిస్తారని నమ్ముతున్నాము. నిబంధనల విషయంలో రచయిలంతా శ్రద్ధ చూపితే మాకు చాలా శ్రమ తప్పిపోతుంది. కనుక చాలా ఎక్కువ వ్యవధి వుండగానే వేసిన యీ ప్రకటనను, నిబంధనలను, పోటీలో పాల్గొనే రచయితలు తప్పక గమనిస్తారని అనుకుంటున్నాము.

* * *

ఈవారం వనితాలోకంలో వేసిన 'మేధావినిగా స్త్రీ' మే 22 వ తేదీ సంచికనుంచి వరుసగా మేము వేస్తున్న ప్రత్యేక 'వ్యాసావళి'లోని ఆఖరి వ్యాసం. నేటి యువతీయువకులలో వివాహ వ్యవస్థపట్ల గల ఆసక్తి మొదలు, సమిష్టి కుటుంబాలు వాటి ప్రభావం, 'వస్త్రధారణ', 'వంట', 'అలంకరణ'; వీటిలోని వైవిధ్యాలు యీ వ్యాసావళిలో చర్చనీయాంశాలైనాయి. స్త్రీలలో భవిష్యత్ గురించి ఎలాంటి భావాలు వుండగల ఆస్కారముందో ఒక రచయిత్రి చర్చించిన తర్వాత తిరిగి యీ శీర్షికలో హోటళ్ల ప్రభావం, ఉద్యోగాల యిబ్బందులు, చర్చకువచ్చాయి. "ఉపాధ్యాయినిగా స్త్రీ; మేధావినిగా స్త్రీ" వ్యాసాలతో ముగిసిన యీ ప్రత్యేక వ్యాసావళిలో పఠితలకు తమ అభిమాన రచయిత్రులు వారి వారి అభిప్రాయాలను అందించారు.

ఈ 'శీర్షిక'లో యీ విధంగా వైవిధ్యాన్ని తెచ్చామని యీ వ్యాసావళిలోని విషయాలు కూలంకషంగా గాకపోయినా ఆయా రచయిత్రులయొక్క, మా పఠితలయొక్క, దృక్పథాన్ని కొంతవరకు చెప్పగలిగాయని భావిస్తున్నాము. రచయిత్రులలో ఇంచుమించు అందరూ మేము కోరగానే అడిగిన విషయాన్నై తమ అభిప్రాయాలను పంపి శీర్షికను జయప్రదం చేశారు. వారికి మా కృతజ్ఞత. పైవారం 'యదార్థగాథ' ప్రారంభం అవుతుంది.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి రాజశ్రీ


**కథలు :**

| | |
|---|---|
| అమాయకుడి నిర్ణయం | — 20 |
| కన్నీరు | — 32 |

**సీరియల్ కథలు :**

| | |
|---|---|
| కార్యసిద్ధి | — 12 |
| మనసున మల్లెలు | — 24 |
| కూలినగోడలు | — 42 |

**శీర్షికలు : వ్యాసాలు : సినిమా.**

ఉత్తరాలు — 3, ఉవెన్ కార్టూన్ — 6, కామరాజ్ —7, హోమియల్ నర్లేకర్ సమీకరణాలు (2)—9, ఇంటింటిపజ్యాలు—11, వనితాలోకం — 16, వనితావాణి — 18, మద్రాసు నగర వీధుల్లో సాముద్రికం 1—28, వారఫలం—37, నాలుక తెగిన పిచ్చుక—48, పదాగమాల — 50, సినిమా — 52.


కమ్యూనిస్టుల
ఉబ్బరింపు
ఆంధ్రప్రదేశ్
పంచాయ
తీ ఎన్ని
కలు


సోషలిస్టువాదాలు — చెరోదారి
లోహియా
జె.పి.నారా
యణ్


లండన్ నుంచి ఉత్తచేతుల్లో
వచ్చా నుసార్


నాకావల్సింది
విశ్వాసపాత్రమైన
ప్రేమ
కాంగ్రెస్
డెమోక్రాటిక్
ఫ్రంట్

# కామరాజ్ జన్మదినోత్సవం: మద్రాసులో సంబరాలు!

విమానాశ్రయమంతా వేలాది ప్రజలతో క్రిక్కిరిసి ఉంది. మధ్యాహ్నం కావటంవల్ల... సూర్యభగవానుడు తన ప్రతాపాన్ని చూపుతున్నా, ఆ ప్రభావం ఎవరిమీద ప్రసరించినట్లు కనపడదు. అందరి హృదయాలు ఆత్మీయతతోను, అనురాగంతోను నిండిఉన్నాయి. రానున్న విమానం కోసం, రావలసిన ఆత్మీయునికోసం వేలాది ప్రజల కన్నులలా నిరీక్షిస్తుండగా .... 'ఝుంయ్‌మని' రొద చేసికొంటూ ఐ. ఎ. సి. వారి 'బ్రహ్మపుత్ర' విమానం మద్రాసు మీనంబాకం విమానాశ్రయంలో వాలింది.

అదే చిన్ని చొక్కా, అదే(లుంగీ)పంచ ధరించిన కామరాజు అవే చిరునవ్వులను ఒలకబోస్తూ, ముకుళితహస్తాలతో, తనను చూడవచ్చిన అభిమానుల పరంపరను అందుకొంటూ విమానంలోంచి దిగగానే .... వేలాది పుష్పమాలలు ఆయనకోసం, గుంపుల్లోనుంచి చొచ్చుకొంటూ వెళ్లాయి. పూలమాలను వేసి, చేతికి మరో అందమైన పూల గుచ్ఛాన్ని ఇస్తున్నవాళ్లతోను, గాఢమైన ఆలింగనాలతో ఉక్కిరి బిక్కిరిచేసే వారితోను, అభినందనల పరంపరతోను శ్రీ కామరాజు ఉక్కిరిబిక్కిరి అయిపోయారు.

మొన్నటి జులై 15 న శ్రీ కామరాజు 62 వ జన్మదినోత్సవం. ఆరోజు మద్రాసులో పండుగ. వీధివీధికి తోరణాలు. ప్రతి అడుగునా స్వాగతపు సంరంభం. ఆనాడు మద్రాసు ప్రజ వేడుక చేసికొంది. నిజం చెప్పాలంటే కామరాజ్ గారి జన్మదినోత్సవం మద్రాసు ప్రజానీకానికే కాదు, ప్రజాస్వామ్యానికీ, సోషలిజానికీ కూడా వేడుక.

వీధికి ఆవైపున, ఈవైపున బారులుతీరిఉన్న అభిమానుల అందరి నమస్కారాలకు ప్రతి నమస్కారాలు చేస్తూ, అభివందనలకు అభివందనలు చెప్తూ కారులో విమానాశ్రయం నుంచి ప్రయాణం చేస్తున్న శ్రీ కామరాజును చూస్తే ఒళ్లు పులకరిస్తుంది. దేశాన్ని, దేశ ప్రజనూ ఏకంచేస్తూ, అడుగడుగునా ఐకమత్యాన్ని సాధిస్తున్న ఆ మహాశక్తి ఇదేనా ? ఆ మహావ్యక్తి వీరేనా ? .... అనిపిస్తుంది!

విమానాశ్రయంనుంచి నూరు నిమిషాల ప్రయాణము అనంతరం, కాంగ్రెసు కార్యాలయమైన 'సత్యమూర్తి భవన్' కు వచ్చిన కామరాజును తొలుత అభినందించినది మరో కాంగ్రెసు నాయకులు కాదు, మరో మంత్రి అంతకన్నా కాదు. ఆపని చేసింది, చేయగలిగిందీ స్వతంత్రపార్టీ ఆచార్యుడు రాజాజీ. శ్రీ కామరాజు రాకపూర్వమే రాజాజీ 'సత్యమూర్తి భవన్' కు చేరారు. ఆ మహావ్యక్తికోసం తానూ నిరీక్షించాడు. 'సత్యమూర్తి భవనం' వెలుపల కారు దిగి, లోపలకు వచ్చిన కామరాజును కౌగలించుకొంటూ "ఇలాంటి జన్మదినోత్సవాలు ఇంకా ఎన్నో జరుపుకోవాలి" అని శుభాకాంక్షలు తెలుపుతుంటే చూచినవారు, విన్నవారూ విస్తుపోకుండా ఉండలేకపోయారు. తెల్లటి మల్లెల దండను పట్టుకొచ్చారు శ్రీ రాజాజీ తమ వెంట ...

ఈ దృశ్యం చూస్తే, 'మమత' కంటె 'రాజకీయ వ్యత్యాసాలు' పెద్దవి కావేనేమో అనిపించింది! తరువాత శ్రీ జయప్రకాష్‌నారాయణ్ అనిరే అన్నారు : "రాజాజీ, కామరాజుల కలయిక ప్రజాస్వామ్య జీవన విధానానికి" తార్కాణమని.

ఇంతటితో ఆగలేదు. ఆనాటి మహా సంరంభం. అక్కడే కాంగ్రెసు, కాంగ్రెసేతర నాయకులు



పలువురు పూలవర్షం కురిపించారు. ఆయన్ను ఆశీర్వదిస్తూ, ఆయనకు దీర్ఘాయువును ఆశిస్తూ కొందరు దైవప్రసాదాలును, తీర్థాన్ని, విభూతిని పట్టుకొచ్చారు. బ్రాహ్మణులు శాస్త్రోక్తంగా వేద వచనాల్ని పఠించారు. అక్కడినుండి వెళ్లబోతున్న రాజాజీ వద్దకు పరుగున వెళ్లి శ్రీ కామరాజు 'ప్రణామాలు' చెల్లించుకోవటం చూపరులని చలింపచేసింది.

విమానాశ్రయం నుంచి శ్రీ కామరాజ్ కారు, దాని వెనుక వందలాది కార్లు వెళ్లగా వస్తున్న ఊరేగింపు దృశ్యం కనుల పండువగా ఉంది. ఇదో కార్ల ఊరేగింపులాగా, రకరకాల కార్ల ప్రదర్శనలా అనిపించింది. ఒక్కసారి అన్ని కార్లు, అన్ని రకాల కార్లు మనం మరెక్కడో చూడలేమేమో!

దోవలో చాలాచోట్ల ఎండ వేడిమికి 'తారు' కరిగిపోయి ద్రవంగా తయారయింది. అయినా, అదే తారురోడ్డుకు అటూ, ఇటూ ఆబాలగోపాలం దారి పొడుగునా నిలబడి తమ ప్రియతమ నాయకుణ్ణి చూచారు—తనివితీరా చూశారు. 62వ జన్మదినోత్సవానికి సంకేతంగా, శ్రీ కామరాజ్ నగరంలో 62 అందమైన పందిళ్లలో కూడా ప్రయాణం చేశారు. దారంతటా, త్రివర్ణ పతాకాలు ఎగురుతూనే ఉన్నాయి.

విమానాశ్రయంలో శ్రీ కామరాజుకు ఘన

65 వ పేజీ చూడండి

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

# దీపావళి కథల పోటీ

# ముగింపు తేదీ 1-10-'64

- *నవంబర్ నెలలో వెలువడే ఆంధ్ర సచిత్ర వారపత్రిక తొలి సంచిక దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భంలో ఎప్పటికిమల్లే యీ ఏడాదికూడా 'కథలపోటీ' నిర్వహిస్తున్నాము. మంచి కథలకు మరింత ప్రోత్సాహం యిచ్చే నిమిత్తం బహుమతులను పెంచడంకూడా చేస్తున్నాము.*
- *మొత్తం మూడు బహుమతులుంటాయి. బహుమతి పొందిన కథలకు చెందిన సర్వహక్కులు, ఆంధ్ర సచిత్ర వారపత్రికవై వుంటాయి!*

## మొదటి బహుమతి రు. 900 లు
## రెండవ బహుమతి రు. 500 లు
## మూడవ బహుమతి రు. 350 లు

- ఇతివృత్తం తెలుగు జీవితానికి సంబంధించినదై వుండాలి.
- కథ అరఠావు సైజు కాగితాలపై ఒకవేపు సిరాతో రాసిపంపాలి. పన్నెండు పుటలకు మించరాదు.
- పోటీకి గడువు అక్టోబర్ ఒకటవ తేదీ. అంటే మా కార్యాలయానికి అటుపై చేరిన రచనలు ఎంతమాత్రమూ పోటీకి స్వీకరింపబడవు. తమ తమ రచనలు తిరస్కరింపబడినప్పుడు తిరిగి పొందాలని కోరేవారు తమ రచనలతోనే తగినన్ని తపాలాబిళ్ళలు జతపర్చిన చిరునామాగల కవరులను పంపడం తప్పనిసరిగా భావించాలి.
- పోటీ విషయంలో ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అనువాదాలు, అనుకరణలు పనికిరావు. రచనలు సొంత రచనలైతీరాలి. సంపాదకుల నిర్ణయమే తుది నిర్ణయం.
- ప్రతి రచయిత తన రచనతోపాటు (1) కలం పేరుతో రాస్తే అసలు పేరు (2) కథ తన సొంతమేనని తెలిపే ఒక జాబూ, పూర్తి చిరునామా విధిగా పంపాలని గ్రహించగోరు తున్నాము. పోస్టేజీ లేని రచనలు ఎంతమాత్రము త్రిప్పి పంపబడవు.
- పోటీలో బహుమతులను పొందిన కథలు మూడూ; నవంబర్ 6 దీపావళి ప్రత్యేక సంచికలో వేస్తాము. పోటీలో బహుమతులను పొందని కొన్ని రచనలను కూడా సచిత్ర వారపత్రిక ఇతర సంచికలలో ప్రచురణార్థం స్వీకరించడం జరిగితే ఆయా రచనలను మామూలు రచనలుగానే స్వీకరించడం జరుగుతుంది. వాటికి యథోచిత పారితోషికం యివ్వడం జరుగుతుంది.
- కవరుపై '<u>దీపావళి కథల పోటీకి</u>' అని స్పష్టంగా రాయాలి. రచనలు "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక 7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1" చిరునామాకే పంపాలి. వ్యక్తుల పేర్లతో పంపే రచనలు ఎంతమాత్రమూ ఆమోదింపబడవు.

హొయిల్-నర్లేకర్ సమీకరణాలు [ప్రత్యేక వ్యాసం]

# విశ్వస్వభావము
# క్వాసార్లూ-సమీకరణాలూ!

## 2. విశ్వ స్వభావము

భూమి చుట్టూ చంద్రుడు తిరుగుతున్నాడు. భూమి తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యుడి చుట్టూ తిరుగుతోంది. తన చుట్టూ తిరిగే గ్రహాలన్నిటితోపాటు సూర్యుడు—తన చుట్టూ తిరిగే—పాలపుంతలో దాని కేంద్రం చుట్టూ తిరుగుతున్నాడు. ఈ పాలపుంత అన్నది — తేనె టీగల గుంపు లాగ — లెక్క కందనన్ని (పదివేల కోట్లట) నక్షత్రాల గుంపు. ఒక్కొక్క నక్షత్రమూ భూమికి ఎన్నో రెట్లున్న సూర్యుడికి ఎన్నో రెట్లు. మనకు అతి చేరువగా ఉన్న నక్షత్రాన్ని చేరడానికి, సెకనుకు 186000 మైళ్లు పయనించ గల వెలుతురుకి నాలుగు సంవత్సరాలు పట్టుతుంది. అంతంత దూరాల్లో ఉన్న నక్షత్రాలు లెక్కకు మించి ఉన్నాయి యీ పాలపుంతలో. పాలపుంతకు దాని వ్యాసా (Diameter)నికి ఏడు రెట్లు దూరాన మరొక నక్షత్రపు గుంపు, దానికి దూరంగా మరొకటి, ఇలాగే మన దూర దర్శినీ యంత్రాలకు ఈనాటికీ అందుతూన్నంత దూరదూరాల వరకును. ఈ నక్షత్ర జగత్తులు కాక, నక్షత్రాలలో ఉండే పదార్థమే గుత్తముగా కాక ధూమము కంటే పలచగా, నక్షత్ర జగత్తులు ఆవరించిన కంటే ఎన్నోరెట్లు మేర ఆవరించి ఉన్న, నెబ్యూలాలు — జ్యోతిర్మేఘాలు — ఉన్నాయి. వీటి వలనే విస్తరించి ఉండి వెలుగన్నదే చిమ్మక వల్లగా కనిపించే 'వల్ల మేఘాలు' ఉన్నాయి. కంటికి దూర దర్శినికీ కావరాని రేడియో తరంగాల్నే పంపించే రేడియో నక్షత్రాలున్నాయి. ఈ నక్షత్ర జగత్తులన్నీ — సంత అయిపోయిన తర్వాత సంతలోని మనుష్యుల్లాగు — దూరంగా వెళ్లిపోతున్నాయి. ఇదీ — క్లుప్తంగా చెప్తే — మనమున్న విశ్వ పరిస్థితి.

అయిన్‌స్టీను సార్వత్రిక సాపేక్షతా సిద్ధాంతాన్ని బట్టి మన విశ్వము వక్రము — భూమి ఉపరి భాగము వలెనే — అవధి లేనట్టిదీ పరిమిత పరిమాణ మున్నదీను. కాంతికిరణాన్ని గాని పైకి పంపితే, అది మన విశ్వమంతా చుట్టు తిరిగి వచ్చి మనకు కింది వైపు నుంచి చేరుతుందిట. కోటాను కోట్ల సంవత్సరాల తర్వాత. ఇది విశ్వమంతా స్థిర దశలో ఉన్నదనే వాదము.

### విస్ఫోట వాదము

నక్షత్ర జగత్తులు దూరదూరాలకు పోతున్నాయి అన్న అభిప్రాయాన్ని బట్టి మన విశ్వము వ్యాకోచిస్తున్నదని అన్నారు వైజ్ఞానికులు. "ఈ వ్యాకోచమునకు ఆరంభము ఎప్పుడు జరిగి వుంటుంది" అని ప్రశ్న వేసుకుని గేమో విజ్ఞాని అనేక విధాల సాక్ష్యాన్ని పరిశీలించి "సుమారు ఆరు నూరు కోట్ల సంవత్సరాల క్రితము" అని జవాబు చెప్పేడు. భూమి మీద వున్న సముద్రాలు కేవలము మంచి నీరుతోనే వుండిన క్షణమూ, భూమి మీది రేడియో తీవ్ర (Radio Active) పదార్థాలు ఘన పదార్థాలుగా ఘనీభవించిన క్షణమూ, చంద్ర గోళము ఈనాటి పసిఫిక్ మహా సముద్రపు లోతులను నింపి, భూమితోనే చేరి వుండిన క్షణమూ, ఆరు నూరు కోట్ల సంవత్సరాల క్రితము నాటివే అవడముతో, "ఆరు నూరు కోట్ల సంవత్సరాల క్రితము బ్రహ్మాండము పేలి ఈ కనపడే విశ్వము ఏర్పడినది" అన్న గేమో పండితుని వాదమునకు బలము చేకూరింది. ఇది విస్ఫోట వాదము.

అయితే విస్ఫోటనము వంటి హఠాద్ఘటనలకు ఫలితముగా కాక శాంత ప్రవాహశీలమైన నైసర్గిక పరిణామము వల్లనే మన విశ్వము ఈనాటి స్థితిని చేరినదని నమ్మే వైజ్ఞానికులూ ఉన్నారు. వారిలో హొయిల్ విజ్ఞాని ప్రముఖుడు.

చిరకాలము నుంచీ సూర్యగోళమునకు సుమారు 6000 డిగ్రీల ఉష్ణోగ్రతతో జ్వలించి పోయే ఈ వేడిమి ఏ రీతిగా సమకూడుతున్నదీ ? అన్న ప్రశ్నకు జవాబును అన్వేషించారు వైజ్ఞానికులు. సూర్యగోళముగా ఏర్పడిన జ్వలన వాయువులు — న్యూటన్ చెప్పిన — గురుత్వాకర్షణ వల్ల దగ్గర చేరి కేంద్రము వైపు కుంచించుకోవడములో కిక్కిరిసే నొక్కుడు వల్ల ఈ వేడి కలుగుతున్నదని కొందరు వైజ్ఞానికులు వ్యాఖ్యానించారు. అలాటి వేడిమి లేక పోలేదు. కాని, అది మాత్రమే అయితే ఇంత పాటి ఉష్ణోగ్రత సమకూడ దన్నారు అందరూ. చివరకు పరమాణుశక్తి అన్నది తెలియగానే, సూర్యుని వేడిమికి కారణము అక్కడి పరమాణువుల వస్తువు కొంత శక్తిగా మారుతూండడముతో విడివడ్డ వేడిమే నన్నారూ, ఆ వ్యాఖ్యానము సూర్యుని ఉష్ణోగ్రతను చక్కగా నమ్మేటట్లుగా బోధ పరిచింది. అయితే, ఈ వాదము మరో చిక్కును తెచ్చి పెట్టింది. సూర్యుడే — అనంతంగా కనిపించే నక్షత్రాలా —, జ్వలనానికి వస్తువు శక్తిగా మారి పోతూండడమే ఆధారమైతే క్రమంగా విశ్వములో వస్తువంతా శక్తిగా మారి పోతుంది అనాలి కదా ? అదే నిజమైతే ఒక నిర్ణీత అంత్య స్థితికి విశ్వము చేరుకుంటున్నదన వలెనే ! పరిణామ క్రమములో చివరకు మిగిలే విన్యాసము గాని, వస్తువు మాత్రపు — పుట్టుకురుపు — విజృంభణము గాని లేని, సమధాతువైన, నిర్వికారమైన చక్రభ్రమణగతి ఇదా నిలవ వలసినట్టిది ? విశ్వము వస్తు వినాశనము వైపే పోతున్నది ? అని విచారించి, ఎక్కడో ఒక చోట వస్తు నిర్మాణము కూడా జరుగుతూండ వలెనని కొందరు వైజ్ఞానికులు తీర్మానించుకుని ఆలోచించారు. మిల్లికను మేధాని నక్షత్రాకాశంలో ఎక్కడో, వస్తు నిర్మాణము — సహస్ర ముఖాలుగా వ్యాపించి పోయే వెలుతురు శక్తి గుమిగూడడము వల్ల — జరుగుతూంటుంది అన్నాడు. హొయిల్, "ఎక్కడో అనడమెందుకూ ? మన విశ్వములోనే అంతటా — పల్చగానే కావచ్చు— వస్తువు సృష్టి అవుతోంది. విశ్వము వ్యాకోచిస్తున్న దన్నాము కదా. ఈ వ్యాకోచమువల్ల విశ్వములో వస్తు విస్తృతి సాంద్రత పల్చబడుతుంది. అలాగ పల్చబడిపోకుండా (విశ్వములో సృష్టిక్షేత్రము) Creation field అంతటా ఆవరించివుంది యీ సృష్టి క్షేత్రము నూతన కణములను సృష్టిచేస్తూ వుంటుంది" అన్నాడు.

పోయిన వారం తొలిభాగం ఐన్‌స్టీన్ వాదవిమర్శ చదివారు. ఈ వారం రెండు, మూడు భాగాలు వేస్తున్నాము. పైవారం హొయిల్-నర్లేకర్ 'సమీకరణాలు-ప్రత్యేకత' చదువుతారు

హొయిల్ కి క్రమ పరిణామము మీదా విశ్వస్థితి స్థైర్యము మీదా అచంచలమైన విశ్వాసము. కనుక ఇక్కడ ఒక ద్రవ్య కణము శక్తిగా మారినదంటే, పైన చెప్పిన సృష్టి క్షేత్రములో ఒక 'కలత' దీప్తిగా వ్యాపిస్తుందట. ఇలాగ వ్యాపించిన దీప్తులు చేరినచోటగాని సృష్టి క్షేత్రశక్తి ఒక విలువను అందుకున్నదిరా అంటే, అక్కడ ఒక కణము ఉద్భవిస్తుందిట. ఈ క్షేత్రములో ఒకచోట ద్రవ్యము శక్తిగా మారిపోతూ సృష్టిదీప్తులను వెలయిస్తూవుంటే, వేరుచోట్ల— ఎక్కడ దీప్తి విలువ అతిశయమౌతుందో అక్కడ— కణసృష్టి అవుతూంటుందిట. ఈ రీతిగా మొత్తంగా విశ్వములో పదార్థ—శక్తి పరిరక్షణ జరుగుతూ, వ్యాకోచించే విశ్వములో పదార్థసాంద్రతా, పరిరక్షణకూడా జరుగుతుందంటాడు హొయిల్.

అయితే ఈ కథకీ గురుత్వాకర్షణకీ సంబంధమేమిటి? హొయిల్ గురుత్వాకర్షణతో గొడవ పడినదెక్కడా? అని అడుగుతారు పాఠకులు. అది తెలుసుకోడానికి ఇంకో వైపునించి రావాలి.

విస్ఫోటనమువంటి హఠాద్ఘటనవలనగాక శాంతిప్రవాహశీలిమైన నైసర్గిక పరిణామమువల్లనే మన విశ్వము యీనాటిస్థితికి చేరిందని హాయిల్ సిద్ధాంతం ఆయన "గురుత్వాకర్షణ" ఏదోవిధంగా వస్తువుగుణమే కావాలన్న నమ్మకంతోనే తన పరిశోధనలు చేశాడు.

# 3. క్వాసార్లూ- సవిూకరణాలూ

నక్షత్ర జగత్తులు కానవచ్చేవీ కానరానివీ కూడా ఉన్నాయని మనవి చేశాను. కానరాని వాటిని కొన్నిటిని అవి ప్రసారము చేసే రేడియో తరంగాలు పట్టడము ద్వారా కనుక్కున్నారు. ఇలాగ పట్టిన వాటిలో కొన్ని అతిశక్తి వంతమైన (అనుకున్న దానికి పదిలక్షల రెట్లు) రేడియో తరంగాల్ని ప్రసారించేవి కానవచ్చాయి. అంత శక్తి వాటికి ఎలాగ అలవడిందీ అన్న ప్రశ్నకి 'అవి సాధారణ నక్షత్ర దూరదర్శనులు ఫోటోగ్రాపు చేయ గలిగిన దూరానికి దాటి పోయాయి' అని జవాబు చెప్పుకున్నారు.

హాయిల్, ఫౌలర్లు, విశ్వాంతరాళంలో నక్షత్ర ధూమము నుండి నక్షత్ర జగత్తుల రెట్లు ఏర్పడు తున్నవీ అన్న సమస్యను విప్పే ప్రయత్నంలో ఆ ధూమము మొదట గుమిగూడి, ముద్దలుగా విడి పోయి, తరువాత వేర్వేరు నక్షత్రాలుగా ఏర్పడు తోంది అని లెక్క వేశారు. అయితే ఒక్కొక్కప్పుడు ఆ ధూమము విడిపోకుండా నక్షత్ర మేఘమంతా ఒకే ముద్దగా కూడడము సంభవమే అని తేలినది వారి లెక్కలలో. 1963 సంవత్సరం ప్రారంభ ములో హాయిలూ, అతని అమెరికను సహ పరిశోధ కుడూ చేరి ''నక్షత్ర జగత్తుగా ఏర్పడవలసిన ధూమము ఒకే పెద్ద నక్షత్రముగా— సూర్యుని కంటె పదికోట్ల రెట్లు సైజూ, కాంతీగల ఒకే నక్షత్రముగా ఏర్పడుట కవకాశమున్నది'' అని ప్రకటించారు. కొద్దివారాలు గడచిన తర్వాత పెలోమర్ కొండమీది 200— అంగుళముల దూరదర్శిని తీసిన ఫోటోలో మందకాంతి గల ముద్ద— చుక్క కాదు !— కనబడినది. తరవాత ఇంకో ఇరవై కనబడ్డాయి.

వీటి విశేష మేమిటంటే వీటిని పట్టి ఉంచే శక్తి చాలా మట్టుకు గురుత్వాకర్షణ శక్తి నుంచే లభించి ఉండాలి. అయిన్‌స్టీను ఆకర్షణ శక్తే లేదంటాడే, మరి ఇది ఎలాగ వీలు ? మొదట నక్షత్ర జగత్తంతటి ధూమము కుంచించుకుని కేంద్రములో పెద్ద బృహ నక్షత్రముగా ఏర్పడు తుంది. గురుత్వాకర్షణ సూత్రానుసారమే పెద్ద నక్షత్రము తన చుట్టూ ఉన్న నక్షత్ర ధూమాన్ని 'లాగుతుంది' అంటే చాలదు, 'పీల్చేస్తుంది' 'తోడే స్తుంది' 'మింగేస్తుంది' అనాలి. ఈ కిక్కిరింత వల్ల ఆ బృహన్నక్షత్రము కేంద్రము నుంచి అమేయ మైన శక్తితో వస్తుధారలు— వెల్తురు వేగాన్ని కూడా అందుకునేటంత వేగముతో, సూర్యుడికి కోటిరెట్లు ఎక్కువ బరువుతో బయటికి చిమ్ముకు వస్తాయన్నారు హాయిల్ ఫౌలర్లు. 3 సి 273 అన్న బృహన్నక్షత్రముతో అలాటి పెద్ద తోక కూడా ఉన్నది ! ఇవి ఇందాకా చెప్పిన రేడియో తరంగాలను ప్రసారించగలవన్నారు.

డాక్టర్ సైరిల్ హజార్డు అనే విజ్ఞాని రేడియో తరంగాల్ని ప్రసారించే నక్షత్రాలు కంటికి గాని ఫోటోగ్రాఫులో గాని కనబడేవి కాగలవా ? అని వేద చేశాడు ఆస్ట్రేలియాలో. అతనికి చిన్న వెలుగు ముద్ద, దాని వంటిన వెలుగుతోక, ఫోటోగ్రాఫులో కనబడ్డాయి. తరవాతి లెక్కలలో ఆ 3 సి 273 అనే 'ఖమండలము' 1500 కాంతి వత్సరాల దూరాన్న ఉన్నట్టిది అని తేలింది. అది సామాన్యపు నక్షత్ర జగత్తుల కంటె 100 రెట్లు కాంతి గలిగి యుండవలెనని లెక్కలు తేల్చినవి. అయినా, దాని సైజు మాత్రము మామూలు నక్షత్ర జగత్తు సైజులో ఇరవయ్యవ వంతు ! నక్షత్ర జగద్ధా మము ఒకే 'గోళము'గా కుంచించుకున్నదీ, అది రేడియో తరంగాల్ని ప్రసారము చేస్తున్నదీ, విశేషించి— అదృశ్యము కానే కాదు— చక్కగా కానవస్తున్నది. హాయిల్ చెప్పిన బృహన్నక్షత్రము — క్వాసారు అన్నారు దానిని— ఉన్న దన్నమాట. తరవాత మరికొన్ని క్వాసారులు పట్టుబడ్డాయి ఫోటోలలో.

అయితే క్వాసారులను గురించి లెక్కలు ఏమం టాయి ? క్వాసారు కుంచించుకుని కుంచించుకుని బ్రహ్మాండమైన బరువుగల చిన్న కణముగా తయారవాలి. ఇది విశ్వసనీయము కాదు. మీదు మిక్కిలి అయిన్‌స్టీను సిద్ధాంతము ప్రకారము అది అత్యంత భారము పొందడముతో దానివెల్తురు కూడా దాని ఆకర్షణ ఎక్కువ కావడమువల్ల దాన్ని విడి పించుకుని కూడా మనకి చేరలేదు !

హాయిల్ నార్లేకర్లు 'క్వాసారు కుంచించుకో డాన్ని నిరోధించగల శక్తి ఉండాలి, అదేది ?' అని అన్వేషించారు. గురుత్వాకర్షణ శక్తి క్వాసారు సైజుని చిన్న సైజుకి లాగేస్తూంటే, ఆ సైజు దిగిపోకుండా లాగి పట్టే శక్తి కావాలి. అది ఎక్కడి నుంచి రావాలి? హాయిల్ ప్రశాంత మనస్కుడు, హఠాత్సంభవాలు నమ్మడు. అవి అంటే ఒకటో అరో ఉండును గాక. ప్రపంచాన్ని నడిపేవి మాత్రము కాకూడదంటాడు. కనక, అసలు వస్తురాశి (Mass) గమనస్థితి మార్పును నిరోధించగల బద్ధకతత్వము— ఎలాగ ఏర్పడుతోంది? అని ఆలోచించాడు. ఆయనా నార్లేకరూ ఏ వస్తువు ద్రవ్యరాశికీ, దృశ్యమాన జగద్వస్తు రాశికీ గల సంబంధమును వివరించే సవిూకరణాలు నిర్మించారు. వీటి నుంచీ, విశ్వము వ్యాకోచించే రేటు, విశ్వవస్తు సాంద్రత, వంటి ఇతర గుణాల నుంచీ లెక్కలు వేసి,— విశ్వాంత రాళ వక్రతా, వస్తు పరిసర వక్రతా సూచిస్తూ అయిన్‌స్టీను నిర్మించిన సార్వత్రిక సాపేక్షతా వాద సవిూకరణాల వంటివి నిర్మించారు. వీటికీ అయిన్ స్టీను సవిూకరణాలకూ అవి సూచించే ఎన్ని ఫలితాల లోనో తేడా లేదు. కొన్ని పరిస్థితులలో అయి న్‌స్టీను సవిూకరణాలు న్యూటన్ సవిూకరణాలతో

56 వ పేజీ చూడండి

## ఇంటింటి పద్యాలు

ఆరుద్ర

### జోకరు కోశారా ?

ఆనందరావుగారు మాజీ జడ్జీ
ఆయనకు చాలా ఇష్టం కాంట్రాక్టు బ్రిడ్జీ
అయినా వారీ మధ్య ఆడేది రమ్మీ
అందుక్కారణం నా చెప్పండూ డమ్మీ.

### అట్టెంటు దక్షా

ఉల్లాసగా సినిమా చూసే ఘరానా ప్రేక్షకులు
ఒకటికి రెండింతలు ఉత్సేకకులు
రాగానే ఇవ్వాలి కూల్డ్రింకూ కిల్లీ
బాగుందా చిత్రం ? హల్లికి హల్లి
ఈ హాలుకే వస్తారేం మళ్లీ మళ్లీ
ఇక్కడే బాగుంటుంది మిఠాయి కిల్లీ.

# కార్యసిద్ధి

## ముద్దా చెల్లపతిబాబు

(గతసంచిక తరువాయి)

క్రొ|గా—

పసివాడు అసురేంద్రుడి మాటునే పెరిగి పెద్ద వాడయాడు. సమస్త విద్యలూ నేర్చాడు. సంతతి లేని అసురేంద్రుడు అనింద్యుణ్ణి తన బిడ్డగా చూచుకుని, ముక్కువగా పెంచుకుంటున్నాడు. తగిన వయసు రాగానే, యౌవరాజ్య పట్టాభిషేకం చేశాడు!

యువరాజయిన ఆనింద్యుడు పిన్నవయసులోనే పరమేశ్వరుణ్ణి గురించి తపస్సుచేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై, 'నువు కోరుకున్నట్లు చిరంజీవిగానే ఉంటావు. కాని, దుండగాలుచేసి సాధువుల్ని బాధ పెడితేమట్టుకు నీకు పరాభవం తప్పదు!' అని వరమిచ్చి, అంతర్ధానమయ్యాడు!

ఇలా అనింద్యుడు శివుడివల్ల వరాలు పొంది, తిరిగివచ్చేసరికి, అసురేంద్రుడు మంచం పట్టి అటూ యిటూగా ఉన్నాడు. అవసానకాలం సమీ పించిందని తెలుసుకున్న అసురేంద్రుడు అనిం ద్యుడికి రాజ్యం అప్పగించి, ఇలా చెప్పాడు.

''నాయనా, అనింద్యా! ఈ పిన్న వయసులో నువు శివుడివల్ల వరాలుపొంది ప్రయోజకుడవైనందుకు ఎంతో సంతోషిస్తున్నాను. అయితే— నాకు ఒకే ఒక్క కోరిక మిగిలివుంది. అది నెరవేర్చగల సమ ర్థుడవు నువ్వు ఒక్కడవేనని నువు పుట్టినప్పటి నుంచి నీమీద ఆశలు పెట్టుకుని ఉన్నాను. చెప్ప మంటావా?—' అని అడిగాడు.

అప్పుడు పిన్నవాడు, తండ్రిచేతిలో చెయివేసి, 'నాయనా!— నీ కోరిక తీర్చటమే జీవితంలో నాకు మొట్టమొదటి విధి. తప్పక తీరుస్తాను. సంశ యించక చెప్పు!' అంటూ నమ్మబలికాడు. ఆ మాటకు అసురేంద్రుడు పసివాణ్ణి దగ్గరకు చేర దీసుకుని—

'అనింద్యా!— ఒకప్పుడు దేవరాజయిన ఇంద్రుడు నన్ను తీరని అవమానం చేశాడు. అది నాకేకాదు, మన జాతికే హృదయశల్యమై బాధిస్తూ ఉంది. ఆ అవమానం ఇప్పటికీ నా గుండెల్లో రగులుతూనే ఉంది. దానికి తగిన శాస్తిచేసి, కసి తీర్చుకుందామంటే, బ్రహ్మపోసిన ఆయుష్షు ఇంతటితో నాకు సరి పోతున్నది. కనుక, ఈ లోటు, నాయనా!— నీ వల్లనే తీరాలి. వరప్రసాదుడవయిన నీ వల్లనే మన కులానికి కళంకం పోవాలి. అప్పటికిగాని నా ఆత్మకు శాంతిలేదు!!' అనిచెప్పి, తన తుది కోరికను వెల్ల డించాడు.

అందుకు అనింద్యుడు, 'నాయనా!— నీ కెందుకు బెంగ? నిశ్చింతగా ఉండు. మనజాతి గౌరవం నిల బెట్టే బాధ్యత నాది......!' అనగానే అసురేంద్రుడు సంతృప్తితో అవతారం చాలించాడు!

గద్దె ఎక్కిన అనింద్యుడు అపారమైన సైన్యా లను సమకూర్చుకున్నాడు. తన తండ్రి— అసు రేంద్రుణ్ణి అవమానించిన దేవేంద్రుడిపైకి దండెత్తి వెళ్ళాడు. అనింద్యుడి ప్రతాపం ముందు దేవేంద్రుడు చాలలేకపోయాడు. దేవేంద్రుణ్ణి ఓడించి, అనిం ద్యుడు దేవలోకాన్ని ఆక్రమించివేశాడు!

మరణశయ్యమీద తన తండ్రి కోరిన కోరిక అనింద్యుడికి గుర్తువచ్చింది. అనింద్యుడు సింహా సనంపైన కూర్చున్నాడు. బందీలయి ఉన్న ఇంద్రుణ్ణి, అతని పరివారాన్ని ఎదటవచ్చి నిలబడ మన్నాడు.

'ఓయ్, దేవరాజా!— ఒకచిన్నవిషయం, నీకు గుర్తుందో లేదో అని, ఇప్పుడు జ్ఞాపకం చేస్తున్నాను, విను— అసురేంద్రుడనే రాక్షసరాజుని ఒకప్పుడు నువు తీరని అవమానం చేశావు. అవునా?— ఎవ్వరి కైనా కర్మఫలం తప్పదనే నీతి మీ దేవతలు చెప్పిందే. కనుక, దాని ప్రతిఫలం నువ్వు అనుభవించాల్సిన సమయం వచ్చిందిప్పుడు. నేనెవరినో తెలుసా? ఆ రాక్షసరాజయిన అసురేంద్రుడి కొడుకును! పితృ రుణం తీర్చుకోవటానికే ఇప్పుడు నిన్నిక్కడికి రప్పిం చింది. చూడు!— ఇప్పటినుంచీ నువ్వూ నీ పరి వారమూ రోజూ నా ఎదుట హాజరై, మూడేసి గుంజీళ్లు తియ్యాలి, మూడేసి మొట్టికాయలు మొట్టుకోవాలి. అప్పటికిగాని నా తండ్రి ఆత్మ శాంతించదు. ఇది నా శాసనం!' అనిచెప్పి ఆజ్ఞా పించాడు!

బందీలయి ఉన్న దేవరాజుకీ, పరివారానికీ వేరే దారేముందీ? గుంజీళ్లు తియ్యక తప్పిందికాదు. మొట్టికాయలు మొట్టుకోక తప్పలేదు. ఇలా దేవేం ద్రుడంతటివాడు అవమానంతో కృంగిపోతూ ఉంటే చూచి, రాక్షస బృందమంతా సంతోషం పట్టలేక జేజేలు కొట్టారు!

స్వర్గాన్ని జయించిన అనింద్యుడు మర్త్య, పాతాళలోకాలను కూడా అవలీలగా జయించి వేశాడు. రోజూ అతను కొలువుతీరి ఉండగా, నిండు సభలో దేవతలు, మహర్షులు, నరులు, నాగులూ, అంతా వరసలుతీరి నించోవాలి. మునమ్మారు గుంజీళ్లుతీసి,మూడుసార్లు మొట్టికాయలు మొట్టు కోవాలి— ఇదీ అనింద్యుడి దర్బారులో నిత్యమూ జరిగేది.

ఇలా అందరి ఎదటా తనకు జరిగే అవమానం భరించలేకపోయాడు దేవేంద్రుడు. తక్కిన దేవ గణాలను, మహర్షులనూ, నరులనూ, నాగులనూ కూడగట్టుకుని, పరమేశ్వరుణ్ణి గురించి తీవ్ర మయిన ప్రార్థనలుచేశాడు. కొంతమంది సదాసతి కైలాసానికేపోయి స్వయంగా మొరపెట్టుకున్నారు.

అప్పుడు పరమేశ్వరుడు గణపతిని పిలిచి, 'నాయనా గణేశా!—మన భక్తుడైన అనింద్యుడి ఆగడాలు మరీ మీరిపోతున్నాయట. అతనివల్ల ఎంతమంది బాధ పడుతున్నారో, చూడు!— పోయి, నా మాటగా అతన్ని కాస్త హెచ్చరించి రా !—' అని చెప్పాడు.

వినాయకుడు నందీశ్వరుణ్ణి వెంటబెట్టుకుని, అనింద్యుడు మకాంచేసి ఉన్న స్వర్గలోకానికి చేరు కున్నాడు. ముందుగా నందీశ్వరుడి ద్వారా అనింద్యుణ్ణి ఒకమాటు రమ్మని కబురుచేశాడు.

నందీశ్వరుడు కొలువులో ప్రవేశిస్తూండగానే అనింద్యుడు, 'రావయ్యా, రా!— ఊఁ— తియ్, గుంజీళ్లు తియ్యి, మొట్టికాయలు మొట్టుకో!' అని చెప్పి ఆజ్ఞాపించాడు.

అందుకు నందీశ్వరుడు తొందరపడలేదు. నిదా నంగానే, 'అనింద్యా! వచ్చిన వారెవరో కాస్తచూసి మాట్లాడు. నన్ను నందీశ్వరుడంటారు. నీకు ప్రసా దించిన పరమేశ్వరుడి వాహనాన్ని. నీ ఆగడాలు హద్దు మీరుతున్నాయని తెలిసి, కాస్త హెచ్చరించి పోదా మని మా విఘ్నేశ్వరుడు స్వయంగా వచ్చాడు. ఈ మాట చెప్పటానికే ఇప్పుడు నే వచ్చా' అంటూ, నందీ శ్వరుడు తను వచ్చిన పని చెప్పాడు.

''విఘ్నేశ్వరుడయ్యేది, వాడి తాతయ్యేది— ముందు నాకు చెల్లవలసిన గుంజీళ్లు, మొట్టికాయలూ ఇక్కడ చెల్లించి మరీ కదులు.........' అని గద మాయించాడు అనింద్యుడు.

'ఓహో! అంతవరకు ముదిరిందా నీవ్యవహారం? నేను దూతగా వచ్చాను గనుక పూరుకోవలసి వచ్చింది. లేకపోతే నిన్ను ఒకచెయ్యి చూసుకునేవాణ్ణే. అయినా మించిపోయింది లేదులే. మా గణేశుడికీ ఈ వార్త అందజేసి మళ్లీవస్తా. ఆయనే నీకు తగిన శాస్తి చేస్తాడు.......' అంటూ, పోబోయాడు. అంతలో రాజభటులతన్ని చుట్టేశారు. వాళ్ల నందర్నీ ఒక్క విసురుతో అమాంతంగా నెట్టివేసి, వెళ్ళి పోయాడు నందీశ్వరుడు.

నందీశ్వరుడు చెప్పిన వార్త వినగానే వినాయ కుడికి మంటెత్తుకువచ్చింది. వాడి గర్వం ఏపాటో చూద్దామని, తనే బయల్దేరి వెళ్ళాడు.

* * *

'అడుగో, పారిపోయిన పిరికిపంద మళ్లీ వచ్చాడే! మరొక సత్తురకాయన్నికూడా తోడు తీసుకు వచ్చాడు ఈ మాటు. పట్టుకోండి ఇద్దర్నీ!— గుంజీళ్లు తీయించండి!' అని శాసించాడు, అనింద్యుడు.

ఇదివరకు దెబ్బలుతిన్న రాజభటులు ఇప్పుడు వీళ్లని పట్టుకునేందుకు వెనకాడారు.

'వూఁ!— చూస్తారేం?— కానీండి!—' అని గద్దించాడు రాక్షసరాజు. పట్టడానికి వచ్చిన ఆ రాజభటుల్ని గుద్దుకి ఒక్కొక్కడు చొప్పున పడ వేశాడు నందీశ్వరుడు!—

అంతలో వినాయకుడు మహాభారతం రాసిన తన దంతాన్ని పైకెత్తాడు. దాన్ని మంత్రయుక్తంగా అనింద్యుడిపైన ప్రయోగించాడు!

'అనింద్యా!— నన్నుమళ్ళీ గుంజిళ్ళు తియ్యమని కదా ఆజ్ఞాపించావు? కాని, ఇప్పుడు నువ్వే ప్రపంచాన్ని చుట్టిచుట్టి, ప్రదక్షిణ చెయ్యాల్సివస్తుంది, చూడు, తమాషా! అంటూ, చిరునవ్వు నవ్వాడు!

ఆ మంత్రదంతం అనింద్యుణ్ని పొడిచి పొడిచి సింహాసనంనుంచి లేవదీసింది. పరుగులెత్తించింది. ఉరకలు వేయించింది. ఎక్కడెక్కడ దాక్కున్నా, అక్కడక్కడికల్లా వెళ్ళి వెంబడించింది. నీళ్ళలో మునిగాడు. దంతమూ మునిగింది. ఆకాశానికి ఎగిరాడు, అదీ ఎగిరింది, ముల్లోకాల్లోనూ దాక్కునేందుకు జాగా దొరకలేదు రాజుకి. దంతంమాత్రం అతన్ని వదల్లేదు!— పొడిచింది, పొడిచింది. అలా పొడుస్తూనే ఉంది! ఒళ్ళంతా తూట్లుపడేలా పొడిచి పొడిచి హైరానచేసింది!!—

రాక్షసరాజుకు కామరూప విద్య తెలియడం ఒక వింత విషయంకాదు. కనుక, అదితప్ప గత్యంతరంలేదని అనింద్యుడు తెలుసుకున్నాడు. క్షణంలో పందికొక్కు రూపం ధరించి, ఒక కలుగులోకి దూరాడు!

దంతాయుధం కలుగులోకి దూరింది!!—

చావులేకుండా వరం పొందాడేగాని, అనింద్యుడు మంత్రదండం పెట్టే బాధనుంచి తప్పించుకోలేకపోయాడు.

లోకాలు చుట్టి చుట్టి పరుగులెత్తిన అనింద్యుడు పందికొక్కు రూపంతోనే రొప్పుతూ రొజుతూ వచ్చి, చివరకు వినాయకుడి పాదాలమీద పడ్డాడు!— 'శరణు, దేవా! శరణు!!—' అంటూ మూర్ఛపోయాడు.

దయామయుడైన వినాయకుడు తన దంతాన్ని వెనక్కు తీసేసుకున్నాడు. ఒళ్ళంతా తూట్లుపడి, పందికొక్కు శరీరంతో ఉన్న అనింద్యుణ్ని చేర దీసుకుని నుదుర్మారు నిమిరాడు.

మరుక్షణమందే అనింద్యుడు మూర్ఛనుండి తేరుకున్నాడు. ఒంటిమీది గాయాలన్నీ మాయమయ్యాయి. కానీ, ఆశ్చర్యం!— కామరూప విద్య తెలిసినవాడే అయినా అనింద్యుడు ఆ పందికొక్కు రూపంతోనె ఉండిపొయ్యాడుగాని, మళ్ళీ తన నిజ స్వరూపం పొందలేకపోయాడు.!—

అప్పుడు— గణపతిని శరణు చొచ్చిన అనింద్యుడు, 'మహానుభావా!— నీ మహిమ తెలియక బలగర్వంతో నిన్ను తూలనాడాను, క్షమించు!— నీ దాసుణ్ని క్షమించి, ఏలుకో!!—' అంటూ, వినాయకుడి పాదాలముందు శిరస్సు వంచాడు.

విఘ్నేశ్వరుడు మందహాసంతో, 'అనింద్యా!— పశ్చాత్తాపం పెద్దవాళ్ళ లక్షణం. నువ్విలా పశ్చాత్తాపపడటం నాకు చాలా సంతోషంగా ఉంది. ఇప్పుడు నీలో నాకు దైవత్వం గోచరిస్తూంది కాని, రాక్షసత్వం కనబడటంలేదు. కనుక నువ్వు ఆజన్మాంతమూ ఈ మూషిక రూపంతోనే ఉండిపో. నాకు వాహనంగా ఉండు. నాతోపాటు నీకూ మూడు లోకాల్లోనూ పూజ్యత లభిస్తుంది!' అన్నాడు.

అందుకు అనింద్యుడు, 'మహాత్మా!— అంతకంటే నాక్కావాల్సిందేమిటి? నా జీవితమే తరించిపోయిందన్నమాట! అయితే ఇంతకంటే ముఖ్యమైన కోరిక ఒకటి నిలిచిపోయింది. అది తీరకపోతే నా జన్మకు సార్థకతే లేదు. కనుక, ఆ కోరికకూడ తీర్చి నన్ను ధన్యుణ్నిచేయాలి!' అంటూ, తన తండ్రి కోరిన కోరికను పూసగుచ్చినట్టు వివరించాడు.

'స్వామీ!— నా తండ్రి కోరికను శాసనంగా అమలుజరపడం నాకు విధి. నీ దాసుడనైన నన్ను మన్నించి, నా కోరికను చెల్లించడం మీకు విధి. నా ఎదుట నిలబడి భక్తులందరూ గుంజిళ్ళుతీసి, మొట్టికాయలు మొట్టుకుంటేనే నా తండ్రి ఆత్మకు శాంతి కలుగుతుంది. కాబట్టి, ఈ ఒక్క వరం మటుకు ప్రసాదించి, నాకు తరుణోపాయం కలిగించాలి!' అని మనస్సు కరిగేటట్టు మనవిచేశాడు, అనింద్యుడు.

అందుకు వినాయకుడు, 'అనింద్యా!— నువ్వు కోరిన కోరిక సమంజసంగానూ ధర్మబద్ధంగానూ ఉంది. పైగా, ఇది ఒక విధిని నెరవేర్చుకునేందుకు కోరింది కాని, దురుద్దేశంతో కాదు. అందుచేత నేను కాదనను' అనిచెప్పి, అనింద్యుడికి అభయమిచ్చాడు వినాయకుడు.

'అనింద్యుడి పీడ వదిలినా, ఈ గుంజిళ్ళు, మొట్టికాయల బాధ పోవేలేదే!' అంటూ, కొంతమంది, ఆశ్చర్యపోయారు, మరికొందరు విచారించారు, ఇంకా కొందరు కలవరపడ్డారు.

కానీ— ఇప్పుడింకా అనింద్యుడు బతికే ఉన్నాడన్న సంగతి ఎవరికి తెలుసు?— అతను గణపతికి వాహనమై, ముల్లోకాల్లోనూ పూజలందుకోబోతున్నాడనే రహస్యం ఎవరెరుగుదురు?— కనుక, ప్రతి ఒక్కళ్ళనీ సంశయంపట్టి వేధిస్తూంది. ఈ సమస్య తేల్చుకోలేక, ప్రజ గుమిగూడి గుసగుసలాడుకోసాగారు.

అప్పుడందరినీ సమావేశపరచి నందీశ్వరుడలా చెప్పాడు.

'భక్తులారా!— గుంజిళ్ళు తీయడానికి మీ రెందుకు సందేహిస్తున్నారో నాకు తెలుసు. కానైతే, ఇదివరకటి గుంజిళ్ళకూ ఇప్పటి గుంజిళ్ళకూ గల తేడాను మీరు గుర్తించలేదు. చెబుతా వినండి : లోగడ అనింద్యుడి పరిపాలనలో, భయంతో గడగడ



లాడుతూ గుంజీళ్ళు తీసేవారు. అవునా?— కానీ, ఇప్పుడు?— మన ఇష్ట దైవమూ, ఇలువేలుపూ అయినటువంటి వినాయకుడు ఎదుట భక్తిపూర్వకంగా తీస్తున్నాము.........''

అనేసరికి—

'నందీశ్వరా!— నువ్వు చెప్పినమాట చాలా బాగా ఉంది. మాకు మనస్ఫూర్తిగా నచ్చింది. అయితే, ఒక్క సంగతి · రాక్షసరాజైన అనిందృుడు పెట్టిన క్రూర శాసనాన్నే మన గజాననుడు ఎందుకు అవలంభించాల్సి వచ్చిందో మాకర్థం కావటంలేదు.......' అంటూ భక్తులందరూ ఏక కంఠంతో చెప్పారు.

అందుకు నందీశ్వరుడు—

'చక్కటి ప్రశ్నవేశారు. చూడండీ!— అనింద్యుడంటే సామాన్యుడనుకున్నారు కాబోలు! శుక్రాచార్యుడి తపోబలంవల్ల రాక్షసకులం ఉద్ధరించటం కోసం వరప్రసాదంగా జన్మించినవాడు. గొప్ప శివభక్తుడు. ఇప్పుడు మన వినాయకుడి దయను సంపాదించి, పందికొక్కు రూపంలో ఆయనకు వాహనమై ఉన్నాడు. తన వాహనమైన అనింద్యుడి కోరికను మన్నించి, ఈ గుంజీళ్ళు, మొట్టికాయలు పద్ధతిని మన విఘ్నేశ్వరుడు శాశ్వతంగా అమలు చేశాడు' అనిచెప్పి, నందీశ్వరుడు భక్తుల సందేహం తీర్చివేశాడు.

## 9

సింధురాజు వింటున్నాడు,

శుక్రాచార్యుడు చెబుతున్నాడు—

'రాజా!— విన్నావో లేదోగాని, ఈ రోజున కైలాస పర్వతంమీద ఉద్యానంలో చిత్రమైన మామిడి

# కార్యసిద్ధి

చెట్టు మొలిచింది. చూపులకు చిన్నదే అయినా, ఆ చెట్టు విరగకాసి ఉంది. దోరమాగిన కాయలతో, ఆరముగ్గిన ఫలాలతో, అది చూచేవాళ్లకి నోరూరిస్తూ ఉంది. అప్పుడు పుట్టిన పాపలబుగ్గలకూడా అందేలాగా, విరగకాసిన ఆ కాయలు కిందికంటా వేలాడు తున్నాయి!—

నిత్యమూ ఈ ఉద్యానంలోనె గణేశుడూ, మునికుమారులూ కలిసి ఆడుకుంటూ ఉంటారు. కనుల పండువుగా కాసిన ఆ మామిడిచెట్టు ఎవళ్లను మట్టుకు ఆకర్షించదు?

వచ్చివచ్చి మునికుమారులు ఈ చెట్టుకింద ఆగారు. తలా ఒక్క పండూ కోసుకున్నారు, తిన్నారు. లేదు, లేదు! ఇంకా సరిగా తిననేలేదు. సగం కొరికే టప్పటికే, పాపం!— ఒక్కొక్కళ్ళూ, మత్తుమందు చల్లినట్టుగా, కిందపడి పోయారు!—ఒక్కడూ మిగల కుండా, అందరూ నైకం క్రమ్మి పడిపోయారు!

ఇంతలో బొజ్జ వూపుకుంటూ వినాయకుడూ వచ్చాడు. తీరా చూస్తే ఏముందీ?—తన నేస్తాలంతా స్పృహలుతేక లేకుండా చెట్టుకింద పడి ఉన్నారు!— అటూ ఇటూగా పరీక్షగా చూశాడు. విరగకాసిన మామిడి చెట్టూ, చెట్టుకింద పడి ఉన్న మునికుమారులూ తప్ప మరేమీ కనిపించలేదు.

ఇంతమందీ ఇలా పడిపోవటానికిగల కారణమేమిటూ అని దూరం యోచించాడు, వినాయకుడు. ఏదో తొందరపని ఉన్నవాడిలాగా గబగబా చెట్టు దగ్గరికి వెళ్లాడు. కాస్సేపు నిదానించి చూశాడు.




ఆ చెట్టుకి ఒక తొర్ర ఉంది. గభీమని అందులో చూశాడు. అంతే! మరి కనబడలేదు!!—

ఆడుకోవటానికని వెళ్లిన పిల్లలు ఎంతకూ ఇంటికి చేరుకోకపోయేసరికి, వాళ్లవాళ్ల తలిదండ్రు లందరకూ బెంగపట్టుకుంది. వూరంతా తిరిగారు. ఆట స్థలాలన్నీ వెతికి వెతికి, చివరకు ఈ మామిడి చెట్టువద్దకు చేరుకున్నారు. తెలివితప్పి పడివున్న తమతమ పసివాళ్లని చూడగానె, అందరూ గొల్లు మన్నారు!—

ఇలా వాళ్లు ఏడుపులూ పెడబొబ్బలూ పెడుతూవుండగా, ఉన్నట్టే ఉండి ఆ మామిడిచెట్టు కిందికి ఒరుగుతున్నదా అనిపించింది. ఆ వచ్చిన తలిదండ్రులకు ఆత్రమేగాని, చెట్టును గురించిన దృష్టి లేదు! కాని, అంతలోనే, ఫెళఫెళమంటూ భయంకరమైన శబ్దం వినబడింది!— మరు క్షణంలో ఆ వృక్షం, పిల్లవేళ్లతోసహా పెల్లగిలి, కిందపడబోయింది!—

కొంచెం తెరపు మరపులలో ఉన్న తమ పిల్లలకు ఇంకిప్పుడు చావు తప్పదని పెద్దవాళ్ళు నిస్పృహ చేసుకున్నారు. పిల్లలమీది మమకారం కొద్దీ వాళ్ళు, 'బిడ్డలే పోయాక మనమెందుకు ఉండి? మనమూ వాళ్లతోపాటు ఈ చెట్టు కిందనే చద్దాం!' అని నిశ్చయించుకున్నారు. ఈ నిశ్చయంతో, నించున్న చోటునుంచి అడుగు కదపక అలాగే స్థిరంగా ఉండిపోయారు!

ఈ సమయంలో అందరికీ ఆశ్చర్యం కలిగించే ఒకచిత్రం జరిగింది! ఇంత ఆగ్బాటంచేసిన ఆ మాయ మామిడిచెట్టు కింద పడనూలేదు, ఏమీ లేదు!— అది హఠాత్తుగా ఒక రాక్షస రూపం తాల్చి, ఒక పక్కగా నేల కూలింది!!— అప్పుడు ఆ శరీరాన్ని చీల్చుకుని, అలనాటి ఉగ్ర నరసింహ మూర్తిలాగా, గణేశుడు ఇవతలకి వచ్చేశాడు!—

ఇవతలికి వస్తూనే వినాయకుడు, తన స్నేహితులైన మునిబాలకులందరినీ పేరుపేరునా పిలిచాడు. పిల్లలంతా నిద్రపోయి లేచినట్టుగా ఒళ్లు విరుచుకుంటూ లేచి కూచుంటున్నారు. ఇదిచూచి, తలిదండ్రుల సంతోషానికి మేరలేకపోయింది!

అప్పుడు వినాయకుడు తన స్నేహితుల్నీ, వాళ్ల తలిదండ్రుల్నీ కూచోబెట్టి ఇలా చెప్పాడు ·

'చూడండీ!— దొంగవాడంటే 'దొంగ' అని వాడి ముఖంమీద రాసి ఉంటుందనుకున్నారా? వూహుం అలాగే రాక్షసులున్నూ. వింత రూపాలతో వస్తారు. మనతో కలిసిమెలిసే ఉంటారు. మనల్ని నమ్మించి, వంచిస్తారు.''

'ఇప్పుడు ఇంతగా అందర్నీ ఆకర్షించిన ఆ మామిడిచెట్టు ఏమిటనుకున్నారు? వీడు వ్యోమాసురుడనే ఒక రాక్షసుడు. వీడి శక్తివల్ల ఒక్కసారి ఎంతమందికి హాని కలగబోయిందో, మీ కళ్లతో మీరే చూశారుకద!' అంటూ పూరడించాడు.

## 10

శుక్రాచార్యుడు మరొక కథ చెబుతున్నాడు, సింధురాజు వింటున్నాడు—

దేవమాత అదితి, తన నాథుడైన కశ్యప బ్రహ్మను ఒకప్పుడిలా అడిగింది · 'నాథా !—నా సవతిబిడ్డలైన రాక్షసుల దుండగాలు అంతకంతకు మితిమీరి

పోతున్నాయి. వాళ్ళ వన్నూ నా బిడ్డలనూ క్షణం సేపయినా తిన్నగా బతకనివ్వటంలేదు. ఆజన్మాంతమూ మే మిలా హింసలుపడుతూ ఉండవలసిం దేనా ?—'

అందుకు కశ్యప ప్రజాపతి దీర్ఘంగా యోచించి, 'దేవీ !—చిక్కు సమస్యే తెచ్చిపెట్టావు. దేవతలూ, రాక్షసులూ నాకు రెండు నేత్రాల వంటివాళ్ళు. కనుక ఇద్దరూ నాకు సమానమే. అటువంటప్పుడు నే నెవరి పక్షాన మాటాడేది నువ్వే చెప్పు ?— మన సంతతిలో రాక్షసులు కాస్త తామసప్రియులు. కాదనను. వాళ్ళ అప్పుడప్పుడు ఆగడాలు చేస్తుండడమూ నాకు తెలుసు. కడుపున కన్నవాళ్ళే అయినా హద్దుమీరితే భరించడం కష్టమే. అయినా, నాకు నేనై ఈ విషయంలో కలగజేసుకోవడం బాగుండదు. కాని, ఒక చిన్న సలహా చెబుతా విను. చిక్కుల్ని ఛేదించటంలో మొనగాడు పార్వతీదేవి కొడుకు వినాయకుడు. ఆయన విఘ్నాలకు రాజు. ఆయనకు ప్రీతికరమైనటువంటి వినాయకవ్రతం చేశావంటే, నీ మనసులో కోరికలు తప్పక సిద్ధిస్తాయి' అని చెప్పాడు.

*  *  *

భర్త సలహాను అనుసరించి అదితి అతివైభవంగా వినాయకవ్రతం ఆచరించింది.

ఆరోజునే—ఆమె ఉద్యానంలో విహరిస్తూ ఉండగా ఒక చిత్రం జరిగింది !—కేరు కేరుమని ఏడుస్తూ బిల్వ వృక్షం కింద ఒక మగశిశువు దొరికింది.

ఆ బిడ్డను తీసి దేవి ఆప్యాయంగా ఎత్తుకుంది. 'ఎంత పుణ్యం !—ఎంత పుణ్యం !!—ఈ పాపాయి ఎవరో కాదు. నేను నమ్ముకున్న వినాయకుడే నన్ననుగ్రహించి ఇలా వెలిశాడు !—ఏమి నా అదృష్టము !—'' అంటూ ఎంతగానో మురిసిపోయింది. ఈ వార్త తెలిసి కశ్యపుడూ పొంగిపోయాడు.

పిల్లవాడికి తలితండ్రులు 'మహోదధి' అని పేరుపెట్టి, అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు ఆ పిల్లవాడు ఆయేటి కాయేడు పెరిగి పెద్దవాడయ్యాడు. ప్రతీ పనిలోనూ తండ్రికి సహాయం చేస్తూ చేదోడు వాదోడుగా ఉంటున్నాడు. మహోదధి.

ఇలా ఉండగా ఒకనాడు—

కశ్యపబ్రహ్మ దర్శనం కోసం కాశీరాజు వచ్చాడు "మహానుభావా !—నా పెద్ద కుమారుడికి యౌవరాజ్యాభిషేకమూ, కల్యాణ మహోత్సవమూ జరగవలసి ఉన్నాయి. ఇందుకుగాను నిర్విఘ్నంగా కార్యాలు నెరవేరే అమోఘమయిన సుముహూర్తం పెట్టి శుభకార్యాలు జరిపించవలసిన భారం మీపైనే ఉంది.'' అని కోరాడు.

అందుకు కశ్యపుడు, "మహారాజా !—ఇప్పుడు నేనొక గొప్ప వ్రతదీక్షలో ఉన్నాను. అది పూర్తి అయితేగాని నేను కాలు కదపటానికి వీలుకాదు కనక మీ యింటి శుభకార్యాలు జరిపించటానికి మా పిల్లవాడు మహోదధిని పంపిస్తాను. మీ పని దిగ్విజయంగా నెరవేరుతుంది'' అని చెప్పి, సుముహూర్తం నిశ్చయించి, కాశీరాజును సాగనంపాడు. (సశేషం)



సంఘంలో మొదటినుండి స్త్రీ పురుషు లిద్దరికీ సమానమైన బాధ్యతలూ, హక్కులూ ఉండనే ఉన్నాయి. కాని వారి వారి బాధ్యతల, హక్కుల ప్రకృతినిబట్టే వారి మేధాసంపత్తిని ఉపయోగించే అవసరం, అవకాశం ఏర్పడుతాయి. అనాదిన అంటే మన పూర్వీకులు ఎక్కడా స్థిరపడక సంచార జీవులుగా ఉన్నప్పుడు స్త్రీయే కుటుంబానికి పెద్ద. కుటుంబానికంతా ఆహారాన్ని సంపాదించాల్సిన బాధ్యత ఆమెదే. ఆ పరిస్థితులలో ఆమెకు తన దైహిక బలాన్ని ఉపయోగించాల్సిన అవసరం వచ్చింది. ఒక మంచి సేనాధిపతికి ఉండాల్సిన అధికార దర్పం. వ్యూహరచనా శక్తీ కావలసి వచ్చాయి. ఆ అవసరాన్ని బట్టే శారీరకంగా ధృఢంగా, వేటలో, వ్యూహరచనలో ప్రవీణురాలిగా అరితేరింది.

అల్లాగే మనం వేదకాలాన్ని కూడా పరిశీలిస్తే అవసరం, అవకాశాన్ని బట్టే స్త్రీ తన మేధాశక్తిని ఉపయోగించిందే కాని ఎప్పుడూ ఆమె పురుషుడికన్నా మేధాశక్తిలో తక్కువకాదు అని తెలుస్తుంది. వేదకాలంలో స్త్రీ గృహిణిగానే ఎక్కువ ప్రాముఖ్యతను వహించింది. ఆమె పరిధి గృహనిర్వహణను మించి లేదు. భార్య లేనిదే పురుషుడికి యజ్ఞ యాగాదులను నెరవేర్చే అధికారం లేదు. కాని స్త్రీకి సంఘరక్షణలో, పోషణలో పెద్ద బాధ్యత లేదు. గృహిణిగా ఆమెకున్న బాధ్యతలు ఆమెను ఇతర రంగాలు అంటే యుద్ధం, వేట వగైరాల నుండి దూరం చేశాయి. శారీరక బలాన్ని ఉపయోగించాల్సిన అవసరం తగ్గిపోయిందామెకు.

కాని దీనిలో చిత్రం ఏమంటే స్త్రీ యీకాలంలో కూడా మేధాశక్తిని పెద్దగా ఉపయోగించ నేర్చ లేదు. అలా అని ఈ కాలంలో మేధావినులు లేనే లేరని కాదు. కాని ఆ ఉన్నవారు మొత్తం స్త్రీ జనాభాలో చాలా తక్కువ. పురుషుడిలా ఆమెకు కూడా ఓ వ్యక్తిగా సంఘంలో ప్రత్యేకమయిన మనుగడ లేదు. ఆమె బాల్యంలో తండ్రి పంచనా, యౌవనంలో భర్త నీడనా, వృద్ధాప్యంలో కొడుకు అండనా బ్రతకాల్సిందే.

ఆ తరువాత కొన్ని శతాబ్దాల పాటు ఇంచుమించు ఆ పరిస్థితే కొనసాగింది. ఏమయినా మార్పులు వచ్చినా అది బహ్యరూపంలో వచ్చిన మార్పేను. అంతరంగంలో ఎప్పటికీ ఒక్కటే అయిపోయింది ఆమె పరిస్థితి.

దేశ ప్రజలలో చైతన్యం కలక్కుండా ఉంటే అల్లాగే ఉండిపోయే దామె. కాని దేశానికి స్వాతంత్ర్యం రావాలన్న కోరికతో ఉన్నవారు స్త్రీలను కూడా నెమ్మది నెమ్మదిగా ఆ కార్యక్రమంలోకి దింపారు. దాంతో స్త్రీకి తన మేధస్సును ఉపయోగించాల్సిన అవసరం వచ్చింది. ఆమె పరిధి పెద్ద అవడంతో విజయలక్ష్మీ పండిట్ లాంటి రాజకీయ నాయకురాళ్ళు, తోరుదత్, సరోజినీనాయుడు లాంటి కవయిత్రులూ, దుర్గాబాయి గారిలాంటి సంఘ సంస్కర్తలూ ఉద్భవించారు. వీరే ప్రస్తుతం మన తరంలోని మేధావినులకు దారిచూపినవారు.

మేధావినులంటే, రచయిత్రులూ, డాక్టర్లూ, ఇంజనీర్లూ, ఉపాధ్యాయినులూ, ఫిలాసఫర్సు, సంఘ సంస్కర్తలూ. మరి ఎలాంటి ఇతర కార్యక్రమాలలో పాల్గొనేవారని నిర్ణయించుకొంటే ప్రస్తుతం మేధావినులు చాలా మందే ఉన్నారని తెలుస్తుంది. ముప్పాళ, రమాదేవి, ఆనందారామం, లత లాంటి రచయిత్రులూ, స్త్రీల సమస్యల్ని విశాల దృక్పథంతో పరిశీలించే పత్రికా రచయిత్రి మాలతీ చందూర్, సంఘ సంస్కర్త దుర్గాబాయి దేశముఖ్ లాంటి వారు, ఇంకా డాక్టర్లు, ఉపాధ్యాయినులు చాలా మందే ఉన్నారు. మొత్తం మీద ప్రతి రంగంలోనూ స్త్రీ ప్రవేశించి పురుషుడికన్న మేధాశక్తిలో తక్కువేమీ కాదు. అని నిరూపించుంటోంది. అసాధ్యము అనుకున్న ఇంజనీరింగులోకి కూడా స్త్రీ ప్రవేశించింది.

ఇదంతా పరిశీలిస్తే స్త్రీ కూడా అన్ని రంగాల్లో ముందడుగు వేస్తోందనిపించినా, కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే మొత్తం స్త్రీ జనాభాలో ఎక్కువ మంది ఇలా ముందుకు రావటం లేదని స్పష్టమవుతుంది. కారణం అందరికీఅవకాశాలు దొరక్కపోవటమే. ఆ దొరికే అవకాశాలయినా సంపూర్ణంగా దొరకడం చాలా కొద్ది మందికే. ఆ దొరికిన వాళ్ళలో కూడా చాలా కొద్దిమందే సరిగా ఉపయోగించుకో గలుగుతున్నారు. ఈ నాడు ఎంతో మంది స్త్రీలు తమకు కావలసిన విద్య విజ్ఞానాలను సంపాదించుకుని కూడా దాన్ని సక్రమమయిన మార్గంలో ఉపయోగించుకోలేరు.

దీనికి కారణాలు చాలా ఉన్నాయి. ఎంత మన పరిస్థితులు అభివృద్ధి అయ్యాయి. స్త్రీకి కూడా పురుషుడితో బాటే సమానమయిన విద్యావకాశాలు దొరుకుతున్నాయి అనుకున్నా మన సంఘ నిర్మాణమైతేనేం కుటుంబ వ్యవస్థ అయితేనేం, కొన్ని తరాలుగా మన నరాల్లో జీర్ణించుకు పోయిన ఆచారాలూ నమ్మకాలూ అయితేనేం స్త్రీని అన్నిరకాల అవకాశాలనూ సరిగ్గా వినియోగించుకో నివ్వటంలేదు.

ఉదహారణకు చూడండి ఇంట్లో కొడుక్కీ, కూతురికీ ఇద్దరికీ కాలేజీ చదువు చెప్పించాల్సివస్తే ఆర్థిక పరిస్థితి పేరుమీద ఆడపిల్ల చదువు మూలన పడుతుంది. అదే తండ్రి ఇద్దరు కొడుకులకి పై చదువులు చెప్పించాల్సివస్తే అప్పోసొప్పో చేసి చదివిస్తాడు. ఇక్కడ ఆ తండ్రిని కూతురి చదువు ఆపించేశాడేమని నిందించలేం. కారణం ఆ చదవబోయే కొడుకు సరిగ్గా చదివితే రేపొద్దున్న తన స్థానంలో నిలచి కుటుంబపు బాధ్యతల్ని స్వీకరిస్తాడనే ధైర్యం ఆ తండ్రిది. కూతురు ఎంతయినా

# వనితాలోకం 'వ్యాసావళి'లో ఆఖరి వ్యాసం!

పెరాయి ఇంటికి వెళ్ళే పిల్ల. ఎంత ఉద్యోగం చేసినా కన్న ఇంటివారికి సహాయం చెయ్యగలదన్న నమ్మకం ఉండదు.

మొత్తంమీద ఇలాంటి కారణాలవల్లే మన మధ్య తరగతి కుటుంబాల్లో ఆడపిల్లల చదువు మూలన పడుతోంది. ఈ పరిస్థితి పోవాలంటే స్త్రీలు తీరికసమయాల్లో సోమరుల్లాగా కూర్చోక కుటుంబానికి ఉపయోగకరమైన పనులు చేసి కుటుంబానికి సాయంచేసి స్త్రీ కూడా చదువుకుంటే కుటుంబానికి సాయపడగలుగుతుంది అన్న భావన కలగ చేయాలి. అప్పుడే స్త్రీ మేధాశక్తిని సంఘం, కుటుంబం, స్త్రీ అందరూ వినియోగించుకో గలుగుతారు.

ముఖ్యంగా స్త్రీకి తన మేధాశక్తిని ఆమె కిష్టమయిన రంగాల్లో వినియోగించుకోవటాని కడ్డుపడేది ఆమెలో కొన్ని తరాలుగా పాతుకుపోయిన కొన్ని అభిప్రాయాలు. ప్రతి స్త్రీ, చదువుకుని తన మేధాశక్తిని ఉపయోగించ నేర్చినది కూడా మంచి గృహిణిగా తయారయి అలాగే ఉండిపోవా లనుకుంటుంది. అంతేగాని గృహిణిగా తన విధుల్ని సక్రమంగా నెరవేరుస్తూనే వ్యక్తిగా తన రంగంలో ప్రకాశించటాని కున్న అవకాశాల గురించి ఆలోచించదు. పురుషుడిలాగే ఆమెకూ సంఘంలో బాధ్యతలూ, హక్కులూ ఉన్నాయని భావించదు. అందువల్లే చాలామంది స్త్రీల మేధాశక్తి సంఘానికీ ఆమెకూ కూడా ఉపయోగపడకుండా పోతోంది.

ఈ అవరోధాల్ని దాటుకుని తన శక్తిని దాని కనుగుణమయిన రంగంలో వినియోగించటాని కిష్టపడే స్త్రీకి ఎదురయ్యే చికాకులు కూడా చాలా ఉన్నాయి. వాటిలో కొన్ని మన ప్రస్తుత కుటుంబ వ్యవస్థనుబట్టి వచ్చినవే. భార్య వండి పెట్టి, అన్ని సౌకర్యాలూ భర్తకు సమకూర్చటం, భర్త సంపాదించి తెచ్చి పడెయ్యడం కొన్ని తరాలుగా అలవాటయిపోయింది మనకు. అందువల్లే స్త్రీ కూడా ఆమె రంగంలో పనిచెయ్యటానికి వెళ్ళేటప్పటికి ఇంతకుముందు దొరికిన సౌకర్యాలన్నీ దొరకడంలేదు పురుషుడికి. దీనితో చాలా చికాకులు బయలుదేరుతున్నాయి. దీన్నయినా గాని ఇప్పుడు ఎన్నున్న కుక్కర్లు, స్టవ్వులూ వాడి వంటింటి శ్రమను తగ్గించుకుని సర్దుకోవచ్చు.

కాని కొన్ని తరాలుగా ఇంట్లోనే స్త్రీని చూడటాని కలవాటుపడిన పురుషుడు అకస్మాత్తుగా అన్ని రంగాల్లోనూ స్త్రీయే కనిపించేటప్పటికి ఆశ్చర్యపోతున్నాడు. కొంత అసూయ కూడా పుట్టుకొచ్చి స్త్రీ దోవతో అడ్డంగా నిలబడుతోంది. ఇలాంటి పరిస్థితి పోవాలంటే పురుషుడు స్త్రీలోని ఇలాంటి చైతన్యానికి అలవాటు పడాలి. దానికి మరికొన్ని సంవత్సరాలు పడుతుంది. దానికి వేచి చూడటం తప్ప మరో మార్గంలేదు.

ఇవన్నీ స్త్రీకి మేధావినిగా ప్రకాశించటానికి ఉన్న అభ్యంతరాలు కాని స్త్రీ పురుషుడికన్నా కొన్ని విషయాలలో ఆధిక్యతను వహిస్తుంది. ఓ వయస్సు వరకు స్త్రీ పురుషుడి కన్న మేధాశక్తిలో మిన్న. ఆ తరువాత నయినా గాని పురుషుడు ఎక్కువ ప్రాధాన్యత వహించటానికి కారణం అతను ప్రస్తుత ప్రపంచంలో ఎక్కువగా మసలడం. స్త్రీ కూడా అల్లాగే మసల గలిగితే అన్ని రంగాల్లోనూ పురుషుడిలాగానే ముందంజ వేయగలిగితే అన్ని రంగాల్లోనూ ఆమె కూడా ప్రకాశించగలదు. దీనికి కావలసిన అవకాశాలను కల్పించుకుని, అవరోధాల్ని తొలగించుకుని మేధావినిగా సంఘంలో తన స్థానాన్ని భద్ర పర్చుకోవలసిన బాధ్యత స్త్రీదే!



మా పత్రికలకు సుపరిచితులైన శ్రీమతి 'శర్వాణి' అసలు నామధేయం 'శారదమ్మ' 'త్రివేణి' రచనలను మా పత్రిక పాఠకులకు వీరు అందించిన సంగతి వేరే చెప్పనక్కర్లేదు. శ్రీమతి శర్వాణి ఇలా రాశారు. "కన్నడ దేశం నుండి మా వారి ఉద్యోగరీత్యా ఆంధ్రదేశానికి వచ్చి పదేళ్లకు పైగా అయింది. తెలుగువారి జీవిత సాహిత్యాల గురించి తెలుసుకోవాలన్న కోరికా, తెలుగు పాఠకులకు కన్నడ సాహిత్యాన్ని వీలయినంతవరకూ అందించాలన్న అభిలాష ఉంది. అప్పుడప్పుడూ నా అభిప్రాయాలను తెలుగులోనే కాయితం మీద పెట్టే అలవాటు కూడా కద్దు. ఈ సాహిత్యకృషికి మా వారి ప్రోత్సాహం కూడా ఉంది."

ఈమె సొంత రచన 'ఔట్ హవుస్' ఈమధ్యనే పాఠకులు చదివారు.

## జాంగ్రీచేయు విధము

**కావలసిన వస్తువులు:**

పావుశేరు మినపప్పు, ½ కిలో పంచదార, అణా మిఠాయిరంగు, మందముగా ఉండు ఒకచేతి రుమాలు. మధ్యలో చిన్న రంధ్రము (శనగగింజ సైజులో) పెట్టి రంధ్రముచుట్టూ గుండీ కాజా మాదిరిగా కుట్టు వేయాలి.

**విధానము:**

ముందు మినపప్పు బాగుగా పొట్టు లేకుండా కడగాలి. కడిగిన తరువాత నీరు తగలకుండా మెత్తగా రుబ్బాలి. ఎంత మెత్తగా నీళ్ళులేకుండా రుబ్బితే అంతమంచిది. చిటికెడు మిఠాయిరంగు కొద్ది నీళ్లతో కలిపి రుబ్బుచున్నప్పుడు పోయువలెను. తరువాత అర కిలో పంచదారను ఒక కళాయిలోపోసి పాకం పెట్టుకోవాలి. బాగా గులాబిజామ్ పాకం రానివ్వాలి. వచ్చిన తరువాత దింపి ఒక స్టీలు పాత్ర లోకి తిరగబెట్టాలి. మరల చిటికెడు రంగును కొద్ది (చెంచాడు) నీళ్లతో కలిపి పాకంలో పోయాలి. సవాశేరు నెయ్యి లేక డాల్డా ఒక కళాయిలో పోసి పొయ్యి మీదపెట్టి బాగుగా కాగనివ్వాలి. చేతి రుమాలు లోకి నిమ్మకాయ సైజుల్లో పిండిని తీసుకుని రుమాలు రంధ్రము ద్వారా కళాయిలోకి పడేటట్లు నొక్కాలి. మొట్టమొదట గాజాసైజులో గుండ్రముగా నొక్కాలి. నొక్కిన తరువాత ఆ గుండ్రముమీదనే జాగ్రత్తగా జాంగ్రీ డిజైను మాదిరి వేయవలెను. జాంగ్రీ దోర వేపు రాగానే కాడ గరిటితో దీనిని తీసి పక్కన పెట్టి ఉన్న పంచదార పాకంలో ముంచాలి. ముంచి దానికి ఆ పాకం పట్టేవరకు అంటే 2 నిమిషములు అందులో ఉంచాలి. తరువాత దానిని తీసి ఒక పళ్లెములో 2 నిమిషములు ఆరబెట్టాలి.

ఈ విధముగా పిండినంతా నిమ్మకాయ సైజులో తీసుకుంటూ చేసుకోవాలి. మనము పంచదార పాకంలో ముంచగానే జాంగ్రీకి చక్కగా పాకం పీల్చాలి. అప్పుడే జాంగ్రీ కుదిరినట్లు లెక్క!

—కమ్మిలి శాయాదేవి

# వనితావాణి

## ప్రత్యేక వ్యాసావళి

వనితాలోకం "ప్రత్యేక వ్యాసావళి"లో ఎనిమిదవ వ్యాసమైన "ఆధునిక జీవితంలో హోటళ్ళ వాటి ప్రభావం వాటి స్థానం" చదివాను.

రచయిత్రి శ్రీమతి రాధారాఘవ్‌గారు హోటళ్ళకు ప్రస్తుత సంఘములో గల స్థానమును చాలా విపులముగా వివరించారు. ఆహార పదార్థములు చేయుటలో హోటలు యజమానుల అత్యాచారాలు, అజాగ్రత్తలు, వ్యాసం ముగింపుకుముందు మరికొద్దిగ విపులముగ చెప్పితే ఇంకా బాగుండెడిది.

తప్పెట్ల పద్మామూర్తి. (ఆత్మకూరు)

*   *   *

వనితాలోకంలో శ్రీమతి ముప్పాళ్ల రంగనాయకమ్మగారు వ్రాసిన ఏడవ వ్యాసం, చదివాను. ఆమె, ఈ వ్యాసం చక్కగా విపులీకరించి వ్రాశారు.

ఒకనాటి వూహా రచనలే నేడు యదార్థ వచనాలై, వర్థిల్లుతున్నాయి. ఆనాటి వూహా సౌధాల్లోనే మన మిప్పుడు హాయిని ఆస్వాదిస్తున్నాము.

నేటి, కలల కల్పితాలనే రేపు, కళకళలాడుతుండగా కళ్ళ చూడగలము. రుక్మిణి, కన్న కల ఎప్పటికయినా యదార్థ రూపం దాల్చగలదు.

పి.వరలక్ష్మీబాయ్. (అక్కుపల్లి)

*   *   *

శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి వ్యాసం అంత ప్రమాణంగా లేదు. 1989లో ఆశించదగ్గ మార్పులు ఇప్పుడు కేవలం లేనట్లుగ వారి అర్థమా ?

మం. సావిత్రమ్మ. (విశాఖపట్నం)

*   *   *

26—6—64 వార పత్రికలో పవని నిర్మల ప్రభావతిగారి "లిప్‌స్టిక్ వగైరా కృత్రిమ పాశ్చాత్య సౌందర్య సాధనాలు" చదివిన మీదట నాయొక్క భిన్నాభిప్రాయము వనితావాణి శీర్షికకు వ్రాయాలని పించింది. ప్రచురణ యోగ్యమైన ప్రచురింప గోరెదను.

పవని నిర్మల ప్రభావతిగారు సౌందర్య సాధనములు కృత్రిమమైనవిగా అవి ఉపయోగించిన వారు వికారంగా కన్పడునను భావము వెలిబుచ్చినారు. వారు ఒక్క పౌడరు మాత్రము తగు మోతాదులో ఉపయోగించవచ్చని, కళ్లకు కాటుక, నుదుట తిలకం దిద్దుకొన్న చాలని వ్రాశారు. అట్లుచేసిన మనం శుభ్రంగా కనపడే మాట వాస్తవంగాని అవి అందానికి మెరుగు దిద్దవు. వారుచెప్పిన అలంకరణ సాధనలు సరియైన పద్ధతిలో శరీరచ్ఛాయ కనుగుణమైన ఛాయలలో ఉపయోగించిన తప్పక అందానికి మెరుగువచ్చును. ఎట్లనగా పెట్టుకునే కాటుకను కనురెప్పలోనేగాక రెప్ప పై భాగము (అంచున) ఒక లైనువలె గీచి, కను కొసలయందు సన్నగా అంతమగునట్లు తీర్చిన కండ్లు మరింత అందముగా కనపడును. ఆ విధముగానే కనుబొమ్మలను సరియైన ఆకారమునకు దువ్వెన కొసతో దువ్వి లైనులోనికి రాని వెంట్రుకలను తీసివేసి, అటుపిమ్మట కనుబొమ్మలకు ఉపయోగించు, రంగు పెన్సిలుతో స్ట్రోక్సుద్వారా అతి తేలికగా పెయింటు చేసిన తప్పక మామూలుకన్న అందములో మెరుగు వచ్చును.

ఇహపోతే బాబ్డ్ హెయిర్, లిప్‌స్టిక్, రోజ్ పౌడరు మిగిలినవి ఆంధ్ర వనితలకు జుట్టు కత్తిరించుకునే అలవాటు లేదు గాబట్టి మనకి అది ఎబ్బెట్టుగా కన్పడుతుంది గాని అంతమాత్రాన బాబ్డ్ హెయిర్‌లో అందములేదని చెప్పగలమా? చిన్ని పిలకజెడలు వేసుకొనుటకన్న జుట్టులేనివారు మంచి హెయిర్ స్టైయిలర్ ద్వారా ముఖమున కనుగుణమైన విధానములో జుట్టు కత్తిరించుకొనిన బాగుంటుంది. రోజ్ పౌడరని ప్రభావతిగారు పలుమార్లు వ్రాసినారు. ఫేస్ పౌడర్సన్నీ పింక్ కలర్ల ఛాయలలోనే ఉండును. మనముఖమున కనుగుణమైనయినది ఎన్నుకొనవలెను. ఇహ లిప్‌స్టిక్ విషయంలోకూడా అంతే అది సరియైన షేడ్స్‌లో వాడితే బాగుంటుంది. కానీ ఎటొచ్చీ దక్షిణ ప్రాంతాలలో ఇవి అంతగా అమలులేవు. అందువలన కొంచెం క్రొత్తగా ఎబ్బెట్టుగా కన్పడుతుంది. ఉత్తర దేశంలో చాలామంది ఈ అలంకరణ సాధనాలన్నీ వాడుతారు.

జి. సరోజిని. (కోర్బా)

*   *   *

"ప్రత్యేక వ్యాసావళి" లో తొమ్మిదవ వ్యాసం. "ఉద్యోగాలు—స్త్రీల యిబ్బందులు" శ్రీమతి మందరపు లలితగారు యదార్థాలను వ్రాశారు. వ్యాసం చాలా బాగుంది. వీరు వ్రాసిన దానిలో నేను మొదటి వర్గానికి చెందిన దానను. కానీ ఉద్యోగం కేవలం నేను ప్రపంచానుభవం కోసమే చేస్తున్నానను కుంటాను. ఆగర్భ శ్రీమంతులము కాకపోయినా ఆర్థిక స్వాతంత్ర్య మింతకుపూర్వమున్నదానినే. బూజుపట్టిన భర్తలకు పాఠం నేర్పే యీ వ్యాసం ఇంత చక్కగా వ్రాసినందులకు రచయిత్రి శ్రీమతి మందరపు లలితగార్కి నా ధన్యవాదములు. "ప్రత్యేక వ్యాసావళి" శీర్షికలో క్రొత్త రచయిత్రులకు అవకాశమిస్తే బాగుండునని మా అభిప్రాయము.

కుమారి శేషు (భీమనపల్లి)

*   *   *

"ఉద్యోగాలు : స్త్రీల ఇబ్బందులు" అను వ్యాసం వాస్తవిక దూరముగా నున్నది. వ్యాసం అంతా పురుషులను నిందించుటయే కన్పడుచున్నది. (ఇదివరలో భర్త నీడలో ఇంటిపంచన పడి ఉన్నందుకు ఆడదాన్ని చేతకాని వాజమ్మగా కట్టి నీచంగా చూశారు.) అని సోదరి లలిత వ్రాశారు. ఇది చాలా అసందర్భముగా నున్నది. భర్త భార్యకు ఉద్యోగం చెయ్యనంతమాత్రాన చేతకాని వాజమ్మగా కట్టి నీచంగా చూస్తారనుకొనుట అసహజముగా నున్నది.

ఆర్. అమ్మలు. (శ్రీకాకుళం)

ముఖ్య ప్రకటన

హార్వే

# ట్విన్ టస్కర్

డ్రిల్లు, లాంగ్‌క్లాత్

హార్వేవారి ట్విన్‌టస్కర్ చిహ్నం కలిగివున్న డ్రిల్లు, లాంగ్‌క్లాత్ మీరు ధరించడానికి, ఇంటి వాడకానికి కూడా అతి నిర్దుష్టమైనవి. ట్రౌజర్లకు డ్రిల్లు—బ్లౌజ్‌లు, పెట్టికోట్‌లు, కుర్తాలు, పైజామాలు, దుప్పట్లు, దిండు గలేబులకు లాంగ్‌క్లాత్. హార్వేవారి డ్రిల్లు, లాంగ్‌క్లాత్‌లు గట్టిగా వుండి, వుతుకులకు ఆగి, ఎంత వుతికినా వన్నె తగ్గక చిరకాలం మనగలవు. ఇంత తక్కువ ధరలో ఇంత మేలిరకం గుడ్డ మరొకటి దొరకదు.

ఈసారి మీరు బట్టల దుకాణానికి వెళ్లినపుడు ట్విన్ టస్కర్ చిహ్నం కలిగివున్న డ్రిల్లు, లాంగ్‌క్లాత్ కొనండి. మీరు పూర్తిగా నమ్మదగిన మేలిరకం వస్త్రాలు.

మధుర మిల్స్ ఉత్పత్తి

నాణ్యమైన నూలుకు మారుపేరు

## మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్., మధురై.

మేనేజింగ్ ఏజెంట్స్. ఎ & యఫ్ హార్వే లిమిటెడ్.

అతి మేలిరకం వస్త్రాలు

*చూడ్డానికి ముచ్చటగా వుండగలవు

* చిరకాలం మనగలవు

B3/MMC-12A-TEL



మధురకు చేరిన హార్వేస్



# అమాయకుడి నిర్ణయం

సి.హి.యస్.రామయ్య

ఖాదర్‌బాషా రెండు కళ్ళూ—తన ఇంటిలోనికి వెళ్ళే మరో వ్యక్తిని గమనించాయి. ఆయన కళ్ళు ఆ క్షణంలోనే ఎర్రబడ్డాయి.....

ఆ వెళ్ళే వ్యక్తి మరెవరో కాదు, ఎనిమిదేళ్ళు నిండిన ఆయన కడపటి సంతానం, పేరు హుస్సేన్. చెదరిన జుత్తూ, కొంతగా మురికిబారిన బట్టలూ, అరిగిపోయిన చెప్పులూ తొడుక్కుని, నీరసంగా కనిపిస్తున్నాడు. బడినుండి ఇల్లు చేరిన తర్వాత, మళ్ళీ ఎక్కడెక్కడో తిరిగి రాత్రి తొమ్మిది గంటల ప్రాంతమవుతున్న ఆ సమయంలో—మళ్ళీ ఇల్లు చేరుతున్నాడు....

'బేవకూఫ్ !' అని గొణుక్కుని, ఇంటిలోకి నడిచాడు ఖాదర్. విసురుగా వెళ్ళుతున్న తండ్రికేసి వింతగా చూస్తూ నిల్చున్నాడు ఇబ్రహీం—ఖాదర్ బాషా మొదటి కొడుకు. అతనో ప్రభుత్వపు ఫ్యాక్టరీలో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. ఫాక్టరీనుండి తిరిగి వచ్చిన తర్వాత, తండ్రి నడిపే కిళ్ళీకొట్టులో—తండ్రికి సాయపడేవాడు.

ఖాదర్‌బాషాకు ఉన్నదల్లా ఆ కిళ్ళీకొట్టుమాత్రమే. దాని ఆధారంపైనే తను పిల్లల్ని ఇంతవరకూ పెద్దవారిని చేయగలిగాడు. తల్లిని కోల్పోయిన పిల్లలకు తానే పెద్ద దిక్కుగా ఉంటూ, రక్షిస్తున్నాడు. పెద్దవాడు ప్రయోజకుడయాడు. రెండోది ఆడపిల్ల—రజియా. పెళ్ళి చేయవలసిన తరుణంలో ఉంది. మూడోవాడు హుస్సేన్. విద్యాదశలో ఉంటున్నాడు. ఆడకూతురికి పెళ్ళిని జరిపించి, తన బాధ్యతను తీర్చుకోగలిగితే—ఆ తర్వాత—మగ

నమ్మకంతో ఉన్నాడు ఖాదర్‌బాషా.

వెన్నంటి వచ్చే తండ్రిని గుర్తించలేదు, హుస్సేన్. అయితే విసురుగా వచ్చిన ఖాదర్‌బాషా, చెదరిన జుత్తును ఎడంచేతి పిడికిలితో చేర్చి పట్టుకుని, బలంగా తనవేపుకు లాగాడు.

బిత్తరపోయిన హుస్సేన్, తండ్రివేపు విచిత్రంగా చూశాడు.

"ఏరోయ్ ! బడినుండి ఇప్పుడే వస్తున్నట్టేనా?" —అంటూ కొడుకుని బలంగా కుదించి ప్రశ్నించాడు ఖాదర్‌బాషా.

"లేదు, అప్పుడే వచ్చేశాను, నాన్నా"—అని బెరుకుతనం నిండిన గొంతుకతో జవాబిచ్చాడు, హుస్సేన్.

"ఇంతవరకూ—ఎక్కడ తగలడ్డావూ ?"

ముఖం దించి మౌనం వహించాడు, హుస్సేన్.

"నిన్నేరా అడుగుతూంట, వెధవా ?"—ఖాదర్ బాషా హుంకరించాడు.

".... పార్కులో ...."

"ఏం చేశావూ ?"

".... వూరికే ...."

"చావలేకపోయావూ ? .... " తండ్రి చేతి దెబ్బ, వాడి వీపుమీద గట్టిగా పడింది. ఆ చురుకుదనానికి వాడి కళ్లలో నీళ్లు తిరిగాయి ....

"ఇంతకీ అసలు నే నడగదల్చిందదికాదు.... వెధవా ! మూడు పూటలా మెక్కుతూ, ఇంట్లో ఉండబట్టక, బయటివారిని వ్యవహారాని కీడ్చడం ఎంతకాలంనుండి సాగిస్తున్నావూ ?—నిజం చెప్పు !"

ఈసారి హుస్సేన్ వీపుమీద దెబ్బ పడలేదు.... అయితే చెదిరిన జుత్తును ఖాదర్‌బాషా పిడికిలితో గట్టిగా బిగించాడు.... కుదించాడు ....

హుస్సేన్ పెదాలు దుఃఖంతో కంపించ మొదలెట్టాయి.

"నీతో చదువుకునే చంద్రయ్యను రక్తం వచ్చేలా కొట్టావటగా ?"

తల వూగించాడు హుస్సేన్—అవునన్నట్టు.

"ఎందుకూ ?"

"నా .... పుస్తకంమీది అట్ట చింపేసాడు ... అందుకు .... "

"బోడి అట్ట .... అందుకు .... అలా కొట్టేయ పేనా .... అంతేనా ?!"

మౌనం వహించాడు కుర్రాడు....

తండ్రి, హుస్సేన్ జుత్తును బలంగా ఒక్కసారి విదించాడు ....

"నిజం చెప్పు ! లేకపోతే .... ముక్కలు ముక్కలుగా నరికేస్తాను ..."

"వాడి కలం దాచేశాను .... " వెక్కుతూ జవాబిచ్చాడు కొడుకు.

"ఈ దొంగబుద్ధి నీ కెప్పటినుండి ! .... రాస్కెల్ ! ...." అని విసురుగా లాగి, తోశాడు ఖాదర్‌బాషా. హుస్సేన్ నేలపై పడిపోయాడు. అదే సమయంలో చూరున ఉన్న నునుపైన బెత్తాన్ని లాగి, నానా బూతులు తిడుతూ ఖాదర్‌బాషా—జవాబ్బులేని స్థితిలో నున్న హుస్సేన్ వంటిమీద బాదాడు .... ఆ పసివాడి బాధనూ, "అయ్యో, అమ్మా" అనే కేకలనూ—ఆవేశంలో ఉన్న ఆ తండ్రి వినిపించుకునే స్థితిలో లేకపోయాడు. ఆ స్థితిలో—

వంటి గదిలోనుండి రజియా—ఆ దృశ్యాన్ని చూసి ఓర్చుకోలేక—తమ్ముణ్ణి లేపి, తన దగ్గరకు లాక్కుంది ! సమయ ప్రభానంవల్ల, ఆమెకూ రెండు బెత్తపు దెబ్బలు తగిలాయి. అయితే, ఆమె వాటిని ఓర్చుకో గలిగింది.

"విడిచిపెట్టమ్మాయ్ ! వాడి వీపు చర్మం ఒలిస్తే గాని—వాడికి బుద్ధిరాదు .... " అని ఆవేశంలో అరిచాడు ఖాదర్‌బాషా.

"అలా కొట్టినంతమాత్రాన, తమ్ముడికి బుద్ధి వస్తుందని నువ్వనుకుంటే దాన్ని తలతిక్క వ్యవహార మనే చెప్పాలి .... " అంది, రజియా—కాస్త ఆవేశంతోనే.

"రజియా ...."

"ఎందుకు నాన్నా, నీకే పిచ్చి కోపం ! .... మేం తల్లిలేని పిల్లలమనేగా ! అమ్మ ఉంటే .... ఇలా జరుగుతూంటే—చూస్తూ సహించుకుంటుందా?"

బెత్తాన్ని విసిరిపారేశాడు ఖాదర్‌బాషా.

"తమ్ముడికి లోకం తెలియనితనం. దేన్నీ అమాయకంగా చేయగల స్థితిలో వున్నాడు .... మంచి అనుకుని చెడు చేసినందుకు. మందలించడం తప్ప, కొట్టి, అలా చంపి—వాణ్ణి మంచివాణ్ణి చేయలేమన్న నిజాన్ని నువ్వు తెలుసుకోలేకుండా ఉన్నావు .... వాడూ, నేనూ—నీకు అంత బరువుగా అనిపిస్తే—అమ్మ పోయినప్పుడే—మా యిద్దర్నీ కూడా చంపి పారేసి ఉండకూడదూ ? పీడ విరగడై ఉండేది ...." అంటూ అర్ధావేశంతోను, అర్ధావేదనతోనూ—కంపించిపోతూ తండ్రిని ఎదుర్కొంది.

మాటలు పెగల్చుకోడానికి సాధ్యంగాక—ఖాదర్ బాషా నెమ్మదిగా బయటకి వెళ్లిపోయాడు .... తండ్రిలోని మాతృవత్సల్యం పిల్లలకేం తెలుస్తుంది ?

గట్టిగా ఏడ్వడానికి అశక్తుడయిన హుస్సేన్, వెక్కుతూ వెక్కుతూ తన అక్కయ్య ఒళ్లో వాలి పోయాడు..... తమ్ముణ్ణి అలా తన చేతులతో పొదివి, మరో గదికి తీసుకెళ్లి, చాపమీద పడుకోబెట్ట బోయింది.

హుస్సేన్ మేల్కొనడానికి సిద్ధమయి, కూర్చుని—నెమ్మదిగా—అక్కవేపు ముఖమెత్తి చూశాడు.... అక్క కళ్లల్లో నీళ్లు స్రవిస్తున్నాయి. ఆమె ముఖంలో ఇప్పుడు చిరునవ్వుల్లేవు. తన కోసం, తన్ను రక్షించడం కోసం—నాన్న చేతి బెత్తపు దెబ్బలు కూడా తింది. అక్క ఎంత మంచిది ! ఈ ఇంట్లో, తనను ఇంత మంచిగా చూడగల ఒకే ఒక జీవి అక్క .... అమ్మలాగా చూసుకుంటోందని అప్పుడప్పుడూ నాన్న అనేవాడు .... అంత ప్రేమ లేకపోతే—దెబ్బల రంగం నుంచి తనను రక్షించి ఉండేది గాదు. అయితే, అమ్మ అనే వ్యక్తి సజీవంగా ఉంటే—అక్కకంటే—మరీ బాగా తనను రక్షించి ఉండేది గాబోలు ! .... అయితే, తనకు అమ్మ లేదుగా ! ....

"అలా చూస్తున్నావేం బాబూ ? .... " అని ప్రశ్నించింది, రజియా.

ఇప్పుడు హుస్సేన్ కళ్లలో నీళ్లు లేవు. అయినా వాడు ఇంకా వెక్కుతూనే ఉన్నాడు.... అలా వెక్కుతూనే అక్క కళ్లనీళ్లు తన చేత్తో తుడిచాడు.

"అక్కా ! మరి, బెత్తపు దెబ్బలు నీకూ తగిలాయా ?" అని నెమ్మదిగా ప్రశ్నించాడు హుస్సేన్.

అంత విచారంలోనూ, రజియాకు ఆనందంగా నవ్వు వచ్చింది. వాడి చెదరిన జుత్తును, గారాబంగా వెనక్కు నిమిరింది.

"తమ్ముడూ !—నాన్న గుణం నీకు తెలిసిందే గదూ ! ఏదో కోపంలో కొట్టాడు.... మరే మనుకోకు ! ...." అంది శాంతంగా .... "ఛీ ! .... ఇద్దరం కలిసి, అన్నం తిందాం, రా !"

"నాకు అన్నం వద్దూ, గిన్నం వద్దూ ! ...." అంటూ, మళ్లీ బుంగముఖం పెట్టాడు.

"నా చిట్టి తమ్ముడివి కదూ ! ...." అంటూ అక్క బతిమాలింది.

"అక్కా !" అంటూ లేచి నిలబడ్డాడు హుస్సేన్. "ఇదిగో, చూశావా ! .... " అని చొక్కా విప్పి, వీపును చూపిస్తూ—"తిన్నది చాలు, కడుపు నిండింది. ఇప్పటికి నాకిక ఆకలి లేదు...." అన్నాడు.

హుస్సేన్ వీపుమీది బెత్తపు దెబ్బల వాతలను చూసి, రజియా రెండు చేతులా ముఖం కప్పుకుని కుమిలిపోయింది. అలా క్షణాల వరకూ విచారించిన తర్వాత, ముఖమెత్తి చూసింది.

అయితే, హుస్సేన్ అక్కడ లేడు. ఆ యింట్లోనే లేడు !

ఏంచేయాలోతోచక వీధికి పరుగెత్తి ఇబ్రహీంను కేకేసి పిలిచి, తమ్ముణ్ణి పిలవమంది. ఎక్కడో నిక్షేపంలా ఉంటాడన్న సమాధానమిచ్చి; కొట్టు వ్యాపారంలో మునిగిపోయాడు ఇబ్రహీం.

రజియా నిట్టూర్పు విడిచింది.

* * *

అది అయిదంతస్థుల భవంతి. అందులో అయిదారు ఆఫీసులున్నాయి. పగటి అలసట తర్వాత, అది నింపాదిగా నిద్రపోతున్నట్టు—ఆ నిశి సమయంలో విశ్రాంతి తీసుకుంటోంది. ఆ భవంతి ముందువేపు పేవ్‌మెంటు నానుకుని మెర్క్యురీ వీధి దీపం ప్రకాశవంతంగా వెలుగుతోంది. ఆ సమయంలో తరుచూ మోటారుబండ్ల రద్దీ, కేకల ప్రతిధ్వనుల మినహా—మరే చప్పుడూ వినిపించడం లేదు.

దీపపుస్తంభాన్నానుకుని, కునుకు తీయడానికి ప్రయత్నించాడు హుస్సేన్. అయితే వాడి ప్రయత్నం అంతా సులభంగా జయం పొందలేదు. ఇంట్లో జరిగిన గల్లంతూ, వీపుమీది దెబ్బల మంటలూ, అన్నిటికంటే మిన్నగా—ఆకలికి కడుపులో మంట—వాణ్ణి జోకొట్టలేకపోయాయి. చొక్కా తీసి, పేవ్‌మెంట్‌మీద పడేశాడు. చల్లటిగాలి తగులుతూవుండడంవల్ల—వీపుమీద మంటల బాధ కాస్త కాస్త తగ్గినట్టనిపించసాగింది. కాని, ఎందుకో—వాడికి విచారం పూర్తిగా నశించిపోలేదు. మరిచిపోదామని ప్రయత్నించినా, వాడి మనో పథంలో ఇంట్లో జరిగిన గల్లంతు తరుచూ మెదలసాగింది....

రాస్కెల్ .... ముక్కలు ముక్కలుగా నరికేస్తాను ....

నీకీ దొంగబుద్ధి ఎప్పటినుండి పుట్టిందిరా ? ...

చావలేకపోయావూ, పీడా విరగడైపోనూ ....

"అవునవును .... నాన్న చెప్పినట్టు చచ్చిపోతేనే బాగుణ్ణు !" అని తనలో తాను గొణుక్కున్నాడు, హుస్సేన్ ....

చచ్చిపోయినవారు మళ్లీ తిరిగి రారని తనకి

తెలుసు. అలాగా ఎన్నో కథలు, పాఠాలు తను విన్నాడు. అయితే—తను చచ్చిపోయినందువల్ల నాన్నకు సంతోషం కలుగుతుందేమో ! దీన్నిబట్టి ఆలోచిస్తే—తను బ్రతికిఉండడంవల్ల—నాన్నకు చాలా కష్టాలు కలుగుతున్నవని తెలుస్తోందిగా ! కాని, అక్క అన్నట్టు—అమ్మ ఉంటే—తనిలా బాధ పడేవాడా? నాన్నచేత అన్నిదెబ్బలు తననుకొట్టనిచ్చేదా?

ఇంతకీ తనేం తప్పుచేశాడు ? ఆ చంద్రయ్యను తను కొట్టాడనే గదూ ! .... వాడు మాత్రం తనను కొట్టలేదూ ? తన పుస్తకంమీది అట్టను చింపేయలేదూ ? అందుకే వాణ్ణి తను కొట్టాడు. దాన్ని తప్పని ఎవరైనా అంటే తననూ, ఆ చంద్రయ్యనూ కూడా దండించడం న్యాయమే. అలాగైతే—ఆ చంద్రయ్య కూడా తనలాగే దెబ్బలు తిని ఉండాలి గదా ? అయితే—వాడు తనలాగా వాడి నాన్న చేత దెబ్బలు తిన్నా డేమిటి ?

నాన్న అవసరపడి, తనను కొట్టడం అన్యాయమనే నిశ్చయానికి వచ్చాడు, హుస్సేన్. "నాన్న మంచివాడు కాడు ...." అంటూ విచారం నిండిన ఆవేశంతో గొణుక్కున్నాడు.

నిజమే. తను తెలియక తప్పులు చేశాడు· అందుకై—నాన్న తనను ఎంత క్రూరంగా కొట్టాడు! తప్పుచేసిన తనను నాన్న శిక్షించగలిగితే—నాన్న తప్పుచేస్తే—ఆయన్ని శిక్షించే దెవరు ? ....

భగవంతుడా ?—

"కాదు, న్యాయాన్యాయాలు నిర్ణయించగల చట్టం ...." అని సమాధాన మిచ్చింది, వాడి అంతరాత్మ.

హుస్సేన్ పెదవుల మధ్య చిరునవ్వు మెదిలింది.

అయితే .... నాన్న తప్పు పనులు ఏం చేస్తూంటాడని ?— ఆ విషయాలు కూడా తనకి తెలుసు. ఎంతోమంది కళ్లు గప్పి, కిళ్లీకొట్టులో రహస్యంగా మరో వ్యాపారం కూడా చేస్తున్నాడు. వాడుక దారుల రూపంలో వచ్చే కొంతమందికి మాత్రమే — ఆ వ్యాపార విషయం తెలుసు. ప్రభుత్వం నిషేధించిన ఆ వ్యాపారాన్ని నాన్న రహస్యంగా చేస్తున్నాడని తనకి తెలుసు. అలా ప్రభుత్వాన్ని మోసగించడం—



కోతి చేష్టలు!

# అమాయకుడి నిర్ణయం

నాన్న చేస్తూన్న గొప్ప తప్పుకాదా ? అందుకై తగిన శిక్ష అనుభవించడం కూడా—న్యాయమే గదా ?

చిన్న తప్పు చేసినందుకు తను దెబ్బలు శిక్ష అనుభవించినట్టే—గొప్ప తప్పులు చేస్తూన్న నాన్న కూడా శిక్ష అనుభవించి తీరాల్సిందే ! నాన్న చేసే తప్పు పనుల్ని పోలీసులకి తెలిపితే సరిపోతుంది. వాళ్లు నాన్నను శిక్షిస్తారు. తను తిన్నట్టుగా నాన్న కూడా దెబ్బలు తినగలుగుతాడు ...

ఆ నిశివేళలో హుస్సేన్ ఉన్నచోటుకి కుడివేపుగా ఓ ఫర్లాంగు దూరంలో ఎవరో వస్తున్నట్టు, బూట్ల చప్పుడు వినిపించాయి .... కళ్లప్పగించి ఆవేపు చూశాడు హుస్సేన్. వీధి దీపాల వెలుగులో కాకీబట్టలు తొడుక్కున్న ఇద్దరు వ్యక్తులు నెమ్మదిగా వాడున్నవేపుగా నడిచి వస్తున్నారు ....

వాళ్లు తన దగ్గరికి రాగానే—నాన్న చేసే దొంగ వ్యాపారం గురించి వాళ్లతో చెప్పేయాలి—అని నిశ్చయించుకున్నాడు హుస్సేన్.

కళ్లప్పగించి వాళ్లవేపే చూస్తూ కూర్చున్నాడు హుస్సేన్.

అయిదు నిముషాల తర్వాత, వాళ్లు వాణ్ణి సమీపించి వాడివేపు చూసి ఆగారు. దీపపు వెలుగులో వాళ్లని గుర్తించి చూశాడు హుస్సేన్.

వాళ్లు పోలీసులు కారు. రాత్రి కాపలా కాసే వాచ్‌మేన్‌లు !

"హుస్సేన్ ! నువ్వట్రా ! ...." వాణ్ణి గుర్తించేశాడు—ఒక కాపలా వ్యక్తి.

తల ఊచాడు హుస్సేన్—

"మంచులో కూర్చున్నావేం ?—ఇంటికి వెళ్లి పడుకోరాదూ ? ...."

"వెళతాను ...."

"ఇక్కడ కూర్చున్నావేం ? ...."

"నిద్ర రావడంలేదు.... చల్లగాలికి కొంతసేపు అలా కూర్చుండి పోదామని వచ్చాను ...." అని జవాబిచ్చాడు, హుస్సేన్.

"తొందరగా వెళ్లు .... వెళ్లిపో ...." అని జవాబిచ్చిన పిదప, తోటి వ్యక్తితో కలిసి వెళ్లిపోయాడా కాపలా వ్యక్తి.

నాన్న విషయం వీళ్లతో చెప్పకూడదు—అని నెమ్మదిపడ్డాడు, వాడు.

ఆవేపుగా ఉన్న టవర్ గడియారం పదకొండు గంటలు కొట్టింది.

'అబ్బో, పదకొండు కొట్టింది ?!—ఇట్టే కూర్చుంటే, చేయాల్సిందేదో చేయక, ఇట్టే నిద్రపోతానేమో !' అని మనసులో తలుచుకున్నాడు హుస్సేన్. అందువల్ల, ఉత్సాహంతో లేచి నిలబడి—నేలమీద ఉన్న చొక్కాను తీసి తొడుక్కుని, ఎడంవేపుగా నడక సాగించాడు.

అలా చేసి తీరాల్సిందే ! నాన్నకు చక్కని పాఠం నేర్పించితీరాలి ! ....

నెమ్మదిగా నడిచి, పక్క వీధిలో ఉన్న పోలీస్ స్టేషన్ సమీపించి ఆగాడు. స్టేషన్‌లోకి దూరం నుండే చూశాడు....

ఎదురుగా—బల్లముందు కూర్చున్న ఇన్‌స్పెక్టరు పేపరు చూస్తున్నాడు. ఆయన తలమీదుగా గాంధీజీ చిత్రపటం పూలమాలలతో అలంకరించబడి ఉంది. లోపలగా నలుగురైదుగురు పోలీసులు అటూ ఇటూ తిరుగుతున్నారు.

పోలీస్ స్టేషన్‌లోకి అడుగు పెట్టబోయిన హుస్సేన్ దృష్టి తలవనితలంపుగా గాంధీజీ చిత్రపటంమీద పడింది. ఆయన బోసినవ్వు, అభయమిచ్చే హస్తం వాడ్ని ఆశీర్వదిస్తున్నట్టు అనిపించింది. ఆయన ప్రతిబింబానికి అంతరాత్మతో నమస్కారంచేసి, ముందుకుసాగాడు.

"గుడ్‌మార్నింగ్, ఇన్‌స్పెక్టర్‌సార్ !" అని నమస్కారం చేశాడు హుస్సేన్.

పేపరు చూస్తున్నవాడల్లా—ముఖమెత్తి—వాడివేపు విచిత్రంగా చూశాడు ఇన్‌స్పెక్టర్. చింపిరి జుత్తుతో, బొత్తాము వేయని చొక్కా తొడుక్కుని నీరసంగా కనిపిస్తున్న హుస్సేన్‌ను చూసేసరికి ఆయనకు కోపంరాలేదు, జాలి కలిగింది.

బెదురుగా ఆయనవేపు చూస్తూ—ద్వారం దగ్గరే నిలబడిపోయాడు, హుస్సేన్.

"మరేం భయపడకు. లోపలికి రా, బాబూ !" అని చిరునవ్వుతో జవాబిచ్చి, వాడ్ని ఆహ్వానించాడు.

హుస్సేన్ నడిచి, లోపలికి వెళ్లి—ఆయన కెదురుగా—బల్ల దగ్గర నిలబడ్డాడు .... ఏం చెప్పాలో వాడి కప్పుడు తోచలేదు.

"నీపే రేమిటి బాబూ ? ...." ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

"హుస్సేన్ ...."

"ఎక్కడుంటున్నావు ?"

చెప్పాడు వాడు.

"చదువుకుంటున్నావా ?"

"అవును ...."

"ఏ తరగతి ?"

"నాలుగో తరగతి."

"గుడ్ ! .... బాగా చదవాలి ! .... ఆఁ ! .... ఇంత రాత్రి సమయంలో ఇలా వచ్చావేం ? .... ఏమిటి విషయం ?"

ఆయనవేపు చూస్తూ మౌనంగా నిలబడ్డాడు, హుస్సేన్.

"నువ్వు మగపిల్లాడివి.....ధైర్యసాహసాలుగల వాడివిగా జీవించాలి. కాబట్టి, భయపడకుండా చెప్ప దలచుకున్నదేదో చెప్పు......."

"యస్సార్......." అని చెప్పాడు హుస్సేన్..... "అలాగ అనుకునే వచ్చాను....సార్! తప్పుచేయడం తప్పుగదండీ!"

"కాదూ, మరి!........."

"తెలిక, పొరబాటు చేస్తేకూడా— అది తప్పు కిందే లెఖకు వస్తుంది గదండీ!..........."

"అవునవును......"

"పెద్దవాళ్లు చేసినా, చిన్నవాళ్లు చేసినా— మీరు అందర్నీ ఒక్కవిధంగానే పట్టుకుని, శిక్ష వేస్తారుగదూ?"

"పట్టుకోవడం మా వంతు? శిక్షవేయడం న్యాయమూర్తుల వంతు......."

"పట్టుకున్న పిదప, మీరు దెబ్బలుకూడా కొట్టరేమిటి?"

41 వ పేజీ చూడండి



## జరిగినకథ

అదృష్టం వున్నా, ఆనందానికి నోచుకోని వృద్ధమూర్తి సుబ్బయ్య. బదిలీ అయిన వ్యవసాయ డెమాన్‌స్ట్రేటర్ రామారావుకు వాళ్ళయింట్లో గది అద్దెకు దొరుకుతుంది. విపరీత పరిస్థితుల్లో తారసపడిన ప్రసాద్‌ను దుర్గయ్య ఆదరిస్తాడు. అనుకోకుండా అతనికి విమల, కమలలతో పరిచయమౌతుంది. రామారావు గీసిన చిత్రాలను విమల మెచ్చుకొంటుంది. కమలను చూచిన ప్రసాద్ ఆమెమీదనే తన దృష్టిని లగ్నం చేస్తాడు. రామారావుకు హిందీ నేర్పటానికి సుబ్బయ్యగారు, విమలను నియోగిస్తారు. కమల, ప్రసాద్‌లు సన్నిహితులవుతారు. కాని, ఆమాట విని, సుబ్బయ్యగారు మండిపడ్తారు—కమల మనస్సును మార్చటానికి ఆయన ప్రయత్నం ప్రారంభిస్తాడు. ప్రసాద్ సాహసంచేసి గోడదూకి కమలను కలిసికొన్నా, ఇంతలో రవికుమార్ రావటంవల్ల, మాయోపాయంతో వీధిలోకి రాగలిగాడు. రామారావు విమలను వివాహం చేసికొంటానంటాడు. సుబ్బయ్యగారింట్లో జరిగిన దొంగతనానికి—కమల ప్రసాద్‌ను అనుమానిస్తుంది.

## (గతసంచికతరువాయి)

ఆనాళ సాయంకాలం దుర్గయ్య గదిలోకి బుచ్చిశాస్త్రి, వామనమూర్తి, గిరిబాబూ, నాగలింగం మొదలైన వారంతా చేరుకుని, సుబ్బయ్యగారింట్లో జరిగిన దొంగతనం గురించి చర్చించ సాగారు.

"అబ్బ! ఎలాటి దొంగండీ. ఇంట్లో అంత మంది మనుష్యులుంటూంటే, ఇనప్పెట్టె తాళం బద్దలు గొట్టి, నగలెత్తుకు పోయాడంటే చూడండి, ఎంత గొప్ప గజదొంగో! ఈ మధ్య ఇలాటిది ప్రాంతాలలో జరుగలేదు." అని నాగలింగం గారు ప్రారంభించారు.

"సుమారు ఒక పాతికవేలు పోయుంటుందంటారా?" అని వామనమూర్తి గారు ఆత్రుతగా ప్రశ్నించారు.

"ఉండొచ్చు." అన్నాడు నాగలింగం.

"అంత లేదండీ. పదివేలలో ఉంటుంది." అన్నాడు బుచ్చిశాస్త్రి.

"ఇంతే!" అని చప్పరించారిద్దరు ముగ్గురు.

"లేకపోతే సుబ్బయ్యగారేమైనా తెలివితక్కువాయనటండీ. ఇంట్లో రొక్కం గాని, బంగారం గాని, ఉంచనే ఉంచరు. ఈ పోయినవైనా, కమలకు ఎల్లుండి ప్రధానమని చేయించినవి" అన్నారు బుచ్చిశాస్త్రిగారు.

"ఎల్లుండి కమలకు ప్రధానమా?" అని గిరిబాబు అడిగాడు.

"అవును. మద్రాసు నుంచి ఎవరో వ్యాపారస్థులూ, గొప్ప ఆస్తిపరులూ అయిన వారబ్బాయట. ప్రొద్దున్న బండిలో దిగుతారు వారు, సుమారు పది గంటలకు స్టేషనుకి సుబ్బయ్యగారు, మేమంతా వస్తాము."

"అయితే బుచ్చిశాస్త్రిగారూ ఆ సంబంధం స్థిర పడ్డట్టేనా?"

"ఓ! నిస్సందేహంగా. ఇన్నాళ్ళూ పిల్ల అంత ఇష్టపడలేదు. ఇప్పుడు ఆ అడ్డు కూడా తీరి పోయింది. పిల్ల తన పూర్తి అంగీకారాన్ని తెలియబర్చింది. అందువల్ల త్వరలోనే వివాహం జరిగిపోతుంది."

"అయితే ప్రసాద్ నోట్లో కరక్కాయే నన్నమాట."

"అంతే."

"అసలు ఆ అమ్మాయి, ప్రేమించిందిటండీ ప్రసాద్‌ని. అది అతని భ్రమ గానీ. అలాంటి కుర్రాళ్ళని ప్రేమించరండీ అమ్మాయిలు." అన్నాడు గిరిబాబు.

"మరి ఎలాంటి వారిని ప్రేమిస్తారండీ? తమ లాటి వారినా?" అని వెటకారంగా అడిగాడు వామన మూర్తి.

"మాలాటి వారి నెంతో మంది ప్రేమిస్తూంటారు. నేను స్టేజీ ఎక్కి నటిస్తూంటే ఎందరో నాకు ప్రేమ సందేశాలు పంపారు." అని గర్వంగా గిరిబాబు మీసం తిప్పాడు.

"మరి పాపం, వాళ్ళందరిని మీరు నిరాకరించారన్నమాట."

"లేకపోతే, నెత్తిపది ఎంతమందిని సమాధాన పర్చగలం?"

"అయితే గిరిబాబు గారూ, ఆ మధ్య మీ స్కూలులో, మీకూ ఒక పంతులమ్మకీ ఏదో గొడవైందనీ, ఆమె మీ మీద రిపోర్టు చేసిందనీ అన్నారు. ఆమె ప్రేమని మీరు నిరాకరించారా? లేక ఆమే మిమ్మల్ని — —?"

"అదంతా వట్టి అబద్ధం?"

"అబద్ధం కాదులెండి. ఋజువులు కూడా వున్నాయని మర్చిపోకండి" అన్నాడు వామన మూర్తి కొంచెం తీవ్రంగా.

"నా స్వంత విషయాలు మీ కనవసరం" అన్నారు గిరిబాబు గారు కోపంగా.

"అసలేం జరిగిందండీ?" అని అడిగాడు నాగలింగం గారు.

"అదేమంత పెద్ద రహస్యం కాదు లెండి. లక్ష్మీదేవని ఒక టీచరు ఈయన తనతో అసభ్యంగా ప్రవర్తిస్తున్నాడని హెడ్మాష్టరికి రిపోర్టు ఇచ్చింది. దాని మీద ఆయన దర్యాప్తు చెయ్యగా ఆమె రిపోర్టు నిజమే నని తేలింది. దాంతో ఆయన పైకి రాస్తూంటే, వద్దని ఈయనా మరి కొంత మంది బ్రతిమాలి, ఈయన చేత ఆమెకు క్షమాపణ ఉత్తరం రాయించి, ఆ రిపోర్టు ఆమె ఉప సంహరించుకొనేట్లు చేశారు."

గిరిబాబు కోపంగా, "అంతా అబద్ధం. ఇది ఎవరో కల్పించిన కబురు. మీరు ఇలాంటి దుష్ప్రచారం నా మీద చెయ్యడం బాగులేదు. నేనెప్పుడూ ఎవరి గురించి చెడ్డగా చెప్పను. మీరు నా గురించి ఇలా చెడ్డగా చెప్పడం బాగులేదు."

"మీది అంత మంచి హృదయమైతే ప్రసాద్ గురించి చెడ్డగా సుబ్బయ్య గారి కెందుకు ఉత్తరం వ్రాశారు?" అని బుచ్చిశాస్త్రి అడిగాడు.

ఆ సమయంలో దుర్గయ్యా, ప్రసాద్ ఆ గదిలోకి ప్రవేశించారు.

గిరిబాబు, "నేనా?" అన్నాడు ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"అవును మీరే. మీరు రామం దగ్గర కవరు తీసుకుని రాశారా లేదా?"

గిరిబాబు తెల్లబోయాడు. "అబద్ధం!"

"నాకంతా తెలుసు. సుబ్బయ్య గారు ఆ ఉత్తరం నాకు చూపించారు. ఆ వుత్తరాన్నీ, ఆ కవరునీ నేను బాగా పరిశీలించి చూశాను. ఆ కవరు మీద ఒక మూల రామం తన పేరు రాసుకున్నాడు, చిన్న అక్షరాలతో. నేను మొదట రామునే ఆ ఉత్తరం రాశాడనుకుని రామాన్ని అడిగాను. తనకే పాపం తెలియదన్నాడు. తరువాత ఒక కవరు మీకిచ్చాననీ, అర్ధరాత్రి హోటల్లో కూర్చుని మీరు ఏదో రాశారనీ చెప్పాడు. దాంతో విషయమంతా తేలి పోయింది"

గిరిబాబు తల వంచేసు కున్నాడు. అందరికీ కోపం వచ్చింది.

"నిజమేనా గిరిబాబు గారూ?" అని దుర్గయ్య అడిగాడు. ప్రసాద్‌ని ఆగమని సౌంజ్ఞ చేస్తూ. ప్రసాద్ పళ్ళు పట పట కొరికాడు.

"నిజమేనండీ. నన్ను క్షమించండి. ఏదో కోపంలో అలాంటి పని చేశాను."

"మీరు చేసిన పని వల్ల ఒక అమాయక యువకుడి మీద అందరికీ లేనిపోని అనుమానాలూ, అపోహలూ, కలిగాయనీ గ్రహించారా? మీ ఉత్తరము అతని ప్రేమ జీవితాన్ని భగ్నం చేసిందనీ,

ఖరికి కమల కూడా అతనిని అనుమానిస్తోందనీ, ప్పుడు జరిగిన దొంగతనం కూడా అతని జోక్యంతో జరిగి వుంటుందని ఆమె అనుమానించ వచ్చని తెలుసుకున్నారా ? మీ రింత నీచులనీ, అసూయా పరులనీ నేనెప్పుడూ అనుకో లేదు. ప్రసాద్ మీకేం అపకారం చేశాడు ? అతని గురించి మీకేం తెలుసు ? అసలు అలాంటి పని చెయ్య వలసిన అవసరమే మొచ్చింది ? అసలలాటి కుర్రాడి గురించి అంత చెడ్డగా రాయడానికి మీకు చేతులెలా వచ్చాయి ? మీకూ నాకూ వున్న స్నేహం కొద్దీ వదిలి పెడు్తన్నాను. మరొకణ్ణయితే ఇవాళ వాడి రక్తం కళ్ళ జూసుందును." అన్నాడు దుర్గయ్య కోపంగా.

" దుర్గయ్య గారూ ఏదో బుద్ధి గడ్డి తిని పొర పాటు చేశాను. ఇప్పుడు మీరే ప్రాయశ్చిత్తం విధిస్తే, దానిని శిరసావహిస్తాను. ప్రసాద్ నన్ను క్షమించు " అన్నారు గిరిబాబు గారు. అందరూ అతని యందు కలిగిన అసహ్యం వల్ల మాట్లాడ కుండా ఊరుకున్నారు.

"ఇప్పుడిక చేసేదేముంది ? " అన్నాడు దుర్గయ్య.

" గిరిబాబు గారు చెయ్యదల్చుకుంటే, వుంది " అన్నాడు బుచ్చిశాస్త్రి.

" ఏమిటది ? " అని దుర్గయ్య అడిగాడు.

" మీరేం చెప్పినా చేస్తాను." అన్నారు గిరిబాబు.

" ఆ ఉత్తరం మీరే రాశానని అదంతా తప్పనీ, ప్రసాద్ అంటే కలిగిన అసూయ వల్ల రాశాననీ, అందుకు విచారిస్తున్నాననీ, అతని గురించి మీకేమీ తెలియదనీ, తెలిసినంత వరకూ అతను మర్యాదస్తుడనీ, వేరే ఒక వుత్తరం రాయండి. దాని క్రింద మీరే సంతకం పెట్టండి." అని బుచ్చిశాస్త్రి చెప్పాడు. అందరూ అలా చెయ్య వలసిందే నన్నారు. గిరిబాబు ఆ విధంగా వుత్తరం రాశాడు. తరువాత మరి వాళ్ళ ముందు మొహం ఎత్తుకో లేక, ఇంటికి వెళ్ళి పోయాడు. అతను వెళ్ళి పోయాక అందరూ జరిగిన దాని గురించి కొంచెం సేపు మాట్లాడు కున్నాక, పేకాటకు కూర్చుందామను కున్నారు.

పదిన్నర గంటల దాకా పేకాట జరిగింది. ప్రసాద్, "శాస్త్రి గారు బలేగా గిరిబాబుని పట్టేశారే ? అయితే రామం కవరు మీకు సుబ్బయ్య గారు చూపించారా ? ఇంకా ఏం చెప్పారు ? " అని అడిగాడు.

" కవరూ లేదూ. సుబ్బయ్య గారు చూపించనూ లేదు. మొన్న ఏదో అవసరం వచ్చి, హోటలులో కార్డులు గాని, కవర్లు గాని ఉన్నయా ? అని రామాన్ని అడిగాను. ఆ సందర్భంలో గిరిబాబుకు ఒకనాడు రాత్రి పూట కవరిచ్చానని చెప్పాడు. అప్పటి నుంచి నాకు గిరిబాబు మీద అనుమానంగా వుంది. అనుమానం వ్యక్తపరిస్తే ఒప్పుకోడని, అంతా నాకు తెలిసినట్లు డబాయించాను. దాంతో అతనే బయటపడ్డాడు. అతనలాటివాడని నాకు మొదటి నుంచీ తెలుసు " అన్నాడు బుచ్చిశాస్త్రి.

అందరూ నవ్వారు. ప్రసాద్, " భలే వారేన. అయితే ఇంతకీ ఈ రెండో ఉత్తరం ఎందుకు రాయించారు ? " అని అడిగాడు.

" దాని అవసరం ఎప్పుడైనా రావచ్చు " నన్నాడు శాస్త్రి.

ప్రసాద్ తను టీ త్రాగి వస్తానని బయలు దేరి, హోటలు వైపు వెళ్ళాడు. తక్కిన వాళ్ళు నవ్వుకుంటూ పేకాడ సాగారు.

హోటల్‌లో రామం కలిపిచ్చిన టీ త్రాగిన ప్రసాద్ మెల్లిగా, ప్లాటుఫారం మీదకి వచ్చాడు. చుట్టూ ఆవరించిన చీకటిని రామ నగరం లైట్లు అక్కడక్కడా ఛేదిస్తున్నాయి. ప్లాటుఫారం మీద కొద్దిగా సందడిగా వుంది. ఎందుకంటే రాత్రి పదకొండు గంటలకు వచ్చే బండికి లైన్ క్లియరైంది. రైల్వే కూలీలు సామాను మోసుకుంటూ ఇటూ అటూ తిరుగు తున్నారు. కొందరు నిద్ర పోతున్న ప్రయాణీకులు బద్ధకంగా లేచి ఇటూ అటూ తిరుగుతుంటే, మరి కొందరు, ' రైలు వచ్చాక లేవచ్చని ' మరీ గట్టిగా ముసుగుదన్నిపడు కున్నారు. స్టేషన్ మాష్టరు ఆఫీసులో బెల్లు టింగు టింగు మంటోంది.

రైలు రావడానికి ఆట్టే ఆలస్యం లేదు.

ప్రసాద్ మెల్లిగా నడుస్తూ ప్లాటుఫారం చివరకు వెళ్ళాడు. ఆలోచించుకుంటూ మరో ఫర్లాంగు దూరం పట్టాల మధ్య నడుస్తూ చీకట్లోకి వెళ్ళాడు. పరిస్థితుల్ని చూస్తుంటే కమల వివాహం, మరొకనితో అవక తప్పేటట్లు లేదని అనిపించింది. మళ్ళీ వెనక్కి తిరిగి ప్లాటుఫారం మీదికి వెళ్దామను కుంటూంటే, ఆ చీకట్లో మసకగా, అక్కడిక కొద్ది దూరంలో ఎవరో మనిషి, పట్టాల మీద కూర్చున్నట్లుంది.

దగ్గరికి వెళ్ళి చూశాడు. ఎవరో ఒక స్త్రీ, తల వంచుకుని పట్టాల మీద కూర్చుంది. ప్రసాద్ ఇంకా దగ్గరికి వెళ్ళి, " ఎవరది ? " అని అడిగాడు.

ఆమె మాట్లాడ లేదు. ప్రసాద్ మళ్ళీ అడిగాడు. రెండు మూడుసార్లు రెట్టించాక, "ఓరైతే మీకేల ? " అందా వ్యక్తి, తలెత్తి.

ప్రసాద్ ఆమెను గుర్తించాడు. సుబ్బయ్య గారి పని మనిషి నళిని !

" ఎందుకొచ్చావ్ ఇక్కడికి ? " అని గద్దించాడు.



## మనసైన మల్లెలు

తనెవరో అతను గ్రహించాడని నళినికి అనుమానం వేసింది.

" నా యిష్టం " అంది.

" కొంచెం సేపట్లో రైలొస్తోందని తెలుసా ? "

" తెల్సు "

" పట్టాల మీద నుంచి లేచి, ప్లాటుఫారం మీదకు రా."

" నాను ఈడనే వుంటా. సస్తే సస్తా " అంది.

" అదా నీ వుద్దేశం. చావడానికి వీల్లేదు. ఆట్టే మాట్లాడేవంటే నిన్నీడ్చుకు పోయి పోలీసులకి అప్పజెప్తా."

నళిని ఏడవడం మొదలెట్టింది. "నన్ను సావనివ్వండి బాబూ." అంది ఏడుస్తూ —

" వీల్లేదు." అని. " అసలు నీకీ బుద్ధెందుకు పుట్టింది ? " అని అడిగాడు ప్రసాద్.

కొద్దిసేపు ఏడ్చాక, " బతుకు మీద యిరక్తి పుట్టినాది." అంది.

ప్రసాద్ కొంచెం సేపు ఆలోచించాడు. సుబ్బయ్యగారింట్లో అంత క్రితం రోజు దొంగతనం జరిగింది. ఈ రాత్రి నళిని ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నిస్తోంది. ఈ రెండు సంఘటనలకు సంబంధం వుండి తీరుతుంది.

" ఏం ? దొంగతనంలో వాటా పోయిందనా ? " డబాయించాడు.

నళిని ఘొల్లు మంది. " నానేటీ సెయ్యనేదు బాబూ " అంది.

" చెయ్యక పోవడ మేమిటి ? అంతా నువ్వే చేశావు."

" నాకేటీ తెల్దు బాబూ." అంది ఇంకా ఏడుస్తూ.

" అయితే ఎందుకు చస్తావ్."

" ఆడు నన్ను గోతిలో తోసేసి నాడు బాబూ " అంది పరాకుగా.

"ఎవడు వాడు ? "

" నాకు తెల్దు బాబూ."

" ఇదిగో నళినీ. జరిగిందంతా చెప్తావా సరే సరి లేదా నా సంగతెరుగవ్ నువ్వు. పోలీసులకు అప్పజెప్తాను. వాళ్లు నిన్ను నానా హింసలూ పెట్తారు. సవ్యంగా ప్రవర్తిస్తే నేను నీకు సాయం జేస్తాను."

కొంచెంసేపు ఆలోచించింది నళిని. తను చద్దామనుకొని వచ్చింది. కాని ఆ అవకాశం దాటి పోయింది ప్రసాద్‌ని తను ఎక్కువగా ఎరుగదు. కాని అతను మంచి వాడిలాగ కన్పించాడు. అతని మాటలు చూస్తే దొంగతనం తన నెత్తి మీద పడ్తుందేమో ? నని ఆమెకు భయం వేసింది. అందుకని అసలు సంగతంతా అతనితో చెప్పాలనీ, అతని సాయం పొందాలనీ నిశ్చయించింది. ప్లాటుఫారం దగ్గరికి వెళ్లి అక్కడ ఒక రాతి బెంచీ మీద నళినిని కూచోబెట్టాడు ప్రసాద్. వీళ్లు మాట్లాడుకుంటుంటే, రైలు రావడం, వెళ్లి పోవడం కూడా జరిగింది.

రెండు మాసాల క్రితం రామనగరానికి ఒక సర్కస్ వచ్చింది. అందులో పని చేసే ఒక యువకుడికీ నళినికీ పరిచయం ఏర్పడింది. ఆమెను మద్రాసు తీసుకెళ్లి సినిమాలలో జేర్పిస్తానని ఆశ పెట్టాడు. సర్కస్‌కి ఆమెను డబ్బు లేకుండా పంపిస్తుండేవాడు. సర్కస్ ఆపూరి నుంచి ' జామి ' అనే మరో

పెళ్లైటూరుకి వెళ్లి పోయింది. 'జావి' తో నళిని సెత్తెళ్లి వుండడం వల్ల, సుబ్బయ్య గారింట్లో సెలవు తీసుకుని జావి వెళ్లి ఆ సర్కస్ యువకుడి పరిచయం వృద్ధి జేసుకుంది. ఆ యువకుడి పేరు గంగరాజు. అతను నళినిని వివాహం చేసు కుంటానన్నాడు. కాని ప్రస్తుతంలో డబ్బు లేదనీ, డబ్బు సంపాదించాలనీ, అన్నాడు. క్రమంగా, సుబ్బయ్య గారింట్లో బోలెడు డబ్బుం దనీ, అది తస్కరిస్తే, ఇద్దరూ హాయిగా మద్రాసు వెళ్లి, పెళ్లి చేసుకుని సినిమాలలో జేరవచ్చునని చెప్పి అందుకు నళిని సహాయం చేసేందుకు ఒప్పిం చాడు. తరువాత నళిని రామ నగరం వచ్చి సుబ్బయ్య గారింట్లో పని ప్రారంభించింది. ఒక రోజు రాత్రి దొంగతనానికి సిద్ధమై వచ్చాడు గంగరాజు. ఆరాత్రి అనుకోకుండా రవి కుమార్ వూరి నుంచి తిరిగి రావటం ఎలన పథకం అంతా తారుమారై పోయింది. గంగ రాజు పారిపోయాడు. మళ్లీ రెండోసారి అతను సిద్ధమై అంతక్రితం రోజు వచ్చాడు. ఆరోజు ఇంటిల్లి పాదీ మత్తు మందు మహాత్యంతో పడ్డారు. నళిని సాయంతో ఇనప్పెట్టి పగుల గొట్టి, నగలు దొంగిలించాడు. నళినితో తామిద్దరూ మర్నాడు రాత్రి బండిలో కలకత్తా వెళ్లి పోదామని అన్నాడు. కాని సాయంకాలం నళిని, అతను ఉండే హోటలికి వెళ్తే అతను మధ్యాహ్నమే వెళ్లి పోయాడని, తన చేతికిమ్మని ప్రక్క వాళ్లకొక చీటీ ఇచ్చాడని తెలిసింది. ఆ చీటీలో, అతననుకున్నంత డబ్బు దొరక లేదు కాబట్టి నళినిని వివాహం చేసుకోవడం సాధ్య పడదనీ, అతనింక నళినికి కన్పించ దల్చుకో లేదనీ, వృధాగా అతన్ని గురించి ప్రయత్నించ వద్దనీ రాసి వుంది. దాంతో నళిని కట్టుకున్న ఆశా సౌధా లన్నీ కూలిపోయాయి. ఇటు యజమానికి ద్రోహం చేసింది; తను మోస పోయింది. భయం, విచారం ఎక్కువై రైలు క్రింద తలపెట్టి మరణిద్దామని వచ్చింది.

"గంగరాజంటే, ఒడ్డూ పొడుగ్గా వుండి, బొంగురు గొంతుకతో మాట్లాడు తుంటాడా ?" అని ప్రశ్నించాడు ప్రసాద్.

"ఆడేబాబూ. పొడుగ్గా సలంగా వుంటాడు."

"ఎక్కడి కెళ్లుంటా డంటావ్ ?"

"తెల్దు బాబూ. జామెళ్లాడేటో బాబూ."

అప్పుడు ప్రసాద్‌కి ఒక విషయం జ్ఞాపక మొచ్చింది. సాయంకాలం తను కోవెల నుంచి వస్తూంటే, జావి నుంచి గంగువాడ అనే వూరు వెళ్లే బస్సులో గంగరాజును చూసినట్లు గుర్తొ చ్చింది. రామ నగరానికి పదిహేను మైళ్ల దూరంలో గంగువాడ వుంది. అక్కడికి కొద్ది రోజుల్లో సర్కసు రాబోతుందని కూడా ప్రకటన చేశారు. ఆ సంగతి అందరికీ తెలుసు. కాబట్టి గంగరాజు, గంగువాడ వెళ్లుంటాడని నిశ్చయించాడు ప్రసాద్.

"మా అమ్మ గారి నగల్ని నువ్వు గుర్తించ గలవా ?"

"చూస్తే సెప్పగల్ను బాబూ."

"అయితే నే చెప్పిన మాట విను. తెల్లవారు జామునే బయల్దేరి మనం గంగువాడ వెళ్దాం. అక్కడ గంగరాజును పట్టుకుని పోలీసులకి అప్ప గిద్దాం. నువ్వు నగల్ని గుర్తు పట్టాలి."

"అలాగే బాబూ !" అంది నళిని. అప్పుడు నళినిని హోటలు వద్ద వుండమని చెప్పి, తను దుర్గయ్య వద్దకు వెళ్లి జరిగిన సంగతంతా చెప్పాడు ప్రసాద్. అంతా విని, "అయితే ప్రొద్దున్నే ఊరు వెళ్లండి." అని దుర్గయ్య చెప్పాడు. "నువ్వు జాగ్రత్తగా ప్రవర్తించాలి తమ్ముడూ! ఏ మాత్రం పొరపాటు చేసినా చాలా ప్రమాదం రావచ్చు. వాడె వడో చాలా ఆరితేరిన ఘటంలా వున్నాడు. నేను కూడా వస్తే మంచిదేమో ?"

"అక్కర్లేదు. మీరు హోటలు చూసుకుంటూ వుండండి. సాయంకాలానికల్లా నేను వాణ్ణి పోలీసుల కప్పగిస్తాను." అన్నాడు ప్రసాద్. ఇక్కడ వీళ్లిద్దరూ ఇలా మాట్లాడు కుంటూంటే, అక్కడ హోటల్లో రామం, నళినీ క్రమంగా రాజీకి వచ్చారు.

ముందు నళిని తల వంచుకుని నిలబడ్తే రామమే ఆమెను పలకరించాడు. నళిని ఏడుస్తూ విషయ మంతా చెప్పి, రామాన్ని క్షమాపణ కోరుకుంది. రామం ఆనందం పట్టలేక పోయాడు. నళిని కోసం తన ప్రాణమైనా అర్పిస్తానన్నాడు. నళిని, రామాన్ని "సాలా మంచోడివి" అని మెచ్చుకుంది. ఇక నుంచి రామాన్నే నమ్ముకుని వుంటానని చెప్పింది.

తెల్లవార కుండానే ప్రసాద్, నళినిని తీసుకుని బస్సులో గంగువాడ బయల్దేరాడు. రామం కూడా వాళ్ల వెంట బయల్దేరాడు.

గంగువాడ చిన్న పల్లెటూరు. కాని అది బస్సులకి జంక్షన్. ప్రసాద్ నళినిని, ఒక చిన్న హోటలు వద్ద వుంచి, ఆవూరల్లా తిరిగాడు. కాని గంగరాజు జాడ ఎక్కడ దొరక లేదు. రెండు మూడు గంటలు తిరిగాక, తను పొరపాటు పడ్డాననీ, గంగరాజు ఈ వూరు వచ్చి వుండడనీ అనుకున్నాడు. ఆ హోటలులో నే మెల్లిగా స్నానం కానిచ్చి భోజనం చెయ్య సాగారు. వీళ్లు భోంచేస్తూంటే ఒక మనిషి రెండు కారియర్లు పట్టుకుని వచ్చాడు. ఆ కారియర్లు తెచ్చిన మనిషికి ఏభై ఏళ్లుంటాయి. కాకీ పాంటూ, కాకీ చొక్కా తొడుక్కుని వున్నాడు. అతన్ని ఆ హోటల్లోని సర్వరు సర్కసు గురించి ప్రశ్నలు వేస్తూంటే విని ప్రసాద్ తను పొరపాటు పడలేదని గ్రహించి, మెల్లిగా రామం చెవిలో, ఆ సర్కసు మనిషి వెనకాల వెళ్లి, వాళ్లె

40వ పేజీ చూడండి



# మద్రాసు నగర వీధుల్లో సాముద్రికం!




రాశిచక్రాన్ని విశదపరచే బోర్డు.



'అరచేతిలో వైకుంఠం' వుందా ?

**వ్యాసం: వాశిరాజు ప్రకాశం**
**ఫొటోలు: ప్రభాకర్**

**మా**నవుడు ఆశాజీవి; తానుకన్న కలలు నిజమౌతాయో, కావో, తన జీవితం స్వర్గధామం అవుతుందో లేదో, అన్న సంశయం అతనిలో ఎల్లవేళలా గూడుకట్టుకొని వుంటుంది. భవిష్యత్తును తెలిసికోవాలని, భావి జీవితాన్ని స్వర్ణమయం చేసికొనేందుకు రాచబాటలు వేసికోవాలనీ మానవుడు ఉవ్విళ్ళూరుతూ వుంటాడు.

ఇదే నిజం కాకపోతే, మద్రాసు మహానగరంలోని మూడు వేలమంది 'హస్త సాముద్రికుల'కు జీవనభృతి ఎలా లభిస్తుంది ?

జనసమ్మర్దంతో క్రిక్కిరిసిపోతున్న మహానగరపు విశాల వీధులకు, ఆ వైపున, ఈ వైపున జరుగుతున్న వందలాది వృత్తి, వ్యాపారాలలో హస్త సాముద్రికమూ ఒకటి. ఓ అట్టమీద అరచేతి బొమ్మను వేసికొని, ఆ బొమ్మనిండా ఏదో, పాతికో రేఖలు గీసి, ఆ అట్టను తమ వృత్తికీ, ప్రతిభకూ సంకేతం అన్నట్లుగా ముందు పెట్టుకొని దారిన పోయే ప్రజను ఆహ్వానించే సాముద్రికులకు కూడా అందరితో పాటే వ్యక్తిత్వం ఉంది, భావనా పటిమ ఉంది; ప్రతి జీవిలోనూ ఉండే ఆశలు వీరికీ ఉన్నాయి.

కాని కూటి కోసం కోటి వేషాలు. ఎవడి వృత్తి వాడికి పవిత్రమైంది— ఎవరి వృత్తి వారికి ఓరో ధార్మ్యం కూడా అయి తీరుతుంది. ప్రొద్దున్నే లేచి శుభ్రంగా స్నానం చేసి, కొళ్ళాయి గుడ్డ కట్టుకొని, ఇంతంత విభూతిరేఖలు పెట్టుకొని, తాళపత్రాలు తీసికొని కాస్త ఎండ వచ్చేవేళకల్లా ఏ రోడ్డు వద్దకో వచ్చి, ఏ చెట్టు నీడనో కూర్చొని, దేవపూజతో ప్రారంభించే వారు కొందరయితే,— ప్యాంటు దానికి తగిన రంగురంగుల బుష్షర్టూ వేసికొని, పన్ను



మరో వివరణాత్మక చిత్రణ



చిలకమ్మచేత జాతకాలను చెప్పించటం సరదాగా వుంటుంది!

# నగరంలో మూడువేలమంది యీ వృత్తిమీద ఆధారపడివున్నారు!

కళ్ళద్దాలు పెట్టుకొని...... ఆధునికంగా ప్రజలను ఆకర్షించేవారు మరికొందరు!...మధ్యతరహా వాళ్ళు— అంటే... ఏదో చినిగిన తువ్వాలొకటి పైన వేసికొని, భూతద్దాన్నొకదానిని చేతపట్టుకొని, మాసిన గడ్డంతో పొట్ట చేత బట్టుకొని కూర్చొనే వారన్న మాట— ఇలా, ఎన్నో రకాల వ్యక్తులు, అలానే ఎన్నెన్నో రకాల వ్యక్తిత్వాలూ!

వీళ్ల వృత్తి ధర్మం కోసం అవలంబించే విధానాల్లో కూడా వూహాతీతమైన వైవిధ్యం ఉంది. కొందరు రామచిలుకల చేత కవర్ల దొంతరలో నుంచి ఒక కవరును తీయించి,జ్యోతిష్యం చెప్పేవారు.. మరి కొందరు తడవ తడవకూ తాళ పత్రాలను వెదికేవారు.. ఆధునిక యంత్రాన్నొక దానిని ఆధారంగా చేసికొని నాలుగురాళ్ళు సంపాదించుకొనే వారు మరి కొందరు.... అక్కడక్కడ ఘోషాయివాళ్లు— తెల్లని గడ్డంతో, మెళ్లో మిలమిలలాడే పూసలతో కనుపిస్తుంటారు. వీధులలో కేకలు వేసికొంటూ పోయే 'జాతి' మరొకటి!



ఏం ఆడవాళ్లు మాత్రం తక్కువా? ఓ పెద్దపెద్ద పూసల దండను మెళ్లో వేసికొని, రూపాయంతటి బొట్టుపెట్టుకొని, దేవీ విగ్రహాన్ని ముందు పెట్టుకొని కూర్చుంటారు— "సోది" చెప్పేందుకు.

* * *

అప్పటికి సూర్యుడు నడినెత్తి మీదకు వచ్చాడు. నేనూ ఫొటోగ్రాఫరు ప్రభాకర్ బయలుదేరాం. ఈ సాముద్రికులకు అసలు శాస్త్రం వచ్చో రాదో, ఇదంతా కేవలం బూటకమా లేక నిజమా, ప్రజలు తండోప తండాలుగా వీళ్ల చుట్టూ తిరగడం.... ఏమిటిదంతా! ఎంత చిత్రం! ఎంత పిచ్చిది లోకం.... ఏమయినాసరే, ప్రజల భావాలూ, సాముద్రికం చెప్పేవారి కథలూ తెలిసికొని తీరాలన్న పట్టును విడువక యాత్రను సాగించాం— ఆ నడి ఎండలో.

పండు ముసలి తాతయ్య.... ఆయన నవ్వితే, ఆయనకున్న మూరెడు గడ్డం విచ్చుకొని పోయినట్లనిపించింది! ఆయన తెలుగువాడు కావటం, అయినా కన్నడం, అరవం, కొద్ది కొద్దిగా హిందీ వచ్చిన వ్యక్తి కూడా అవటం.... మమ్మల్నీ మరీ ఆకర్షించాయి. మేమే వెళ్లి పలకరించాం : "ఏం, తాతా, చెయ్యి చూస్తావా ?" అని అడిగేసరికి, అతను ఒక్కసారి ఎగా, దిగా చూసి "మరి నేనున్నది అందుకేగా" అన్నాడు. ఎలా చెప్తాడోనని శ్రద్ధతో చూశాం... కాసేపు ఆయనను నవ్వించాం. చెయ్యి చూపినందుకు ప్రతిఫలం ఇచ్చాం. "తాతా కొన్ని ప్రశ్నలు అడగమన్నావా ?" అని ముందే అడిగాం. ఆయన, పాపం 'సరే'నన్నాడు ! అదే తడవుగా ఎన్నో ప్రశ్నలు వేశాం.

"మీకు నిజంగా ఈ శాస్త్రం మీద నమ్మకం ఉందా?" మేము అడిగాం.

"ఉంది. బోలెడంత నమ్మకం." చెప్పాడతను.

"నీ భవిష్యత్తు నీకు తెలుసునా"

"తెలిసిందేదో తెలుసు. తెలియనిది తెలీదు."

"అసలు మీరు ఈ శాస్త్రం ఎలా తెలిసికొన్నారు, పుస్తకాలు చదివారా ? లేక గురువు వద్ద నేర్చుకొన్నారా ?"

"ఇలాంటివి మరెవరయినా అడిగితే చెప్పను. మీరు అడుగుతున్నారు కాబట్టి చెప్పుతున్నాను. ఒక పట్నంలో చాలా పుస్తకాలు ఉన్నాయి. అక్కడే చదివి తెలిసికొన్నాను... ఆ పుస్తకాల సంగతి మరెవ్వరికీ తెలియదు."



'ఆటో మెటిక్' యంత్రాలతో భవిష్యత్తును చెప్పటం కూడా ఇక్కడి పద్ధతుల్లో ఒకటి. అరచెయ్యితో నొక్కగానే ఒక కాగ్దా పైకివస్తుంటుంది! ఆ కాగ్దులమీద ఏముంటే, అదే ఆ పెద్దమనిషి భవిష్యత్తు!

# మద్రాసు నగరవీధుల్లో హస్తసాముద్రికం తీరుతెన్నులు

ఇలా సాగింది మా సంభాషణ. ఆయన దగ్గర నుండి సెలవు పుచ్చుకొనేలోగా ఒక విచిత్రం జరిగింది. నే నెవరినో, ఎందుకు ఈ ప్రశ్నలను అడిగానో ఆయనకు ముందుగా చెప్పకపోవటం వల్ల— నేను కూడా "జ్యోతిష్యం" నేర్చుకొనేందుకు అడిగానని ఆ తాత భావించటం జరిగింది. "నాయనా, నీకూ కావాలంటే శాస్త్ర రహస్యాలను చెప్తాను. కాని చాలా సాధన కావాలి." అన్నాడాయన. నేను, ప్రభాకర్ ఏమీ సమాధానం చెప్పలేక, "లేదు తాతగారూ, తమాషాకు అడిగాం !" అనేసరికి ఆయన కొంచెం చిన్న బుచ్చుకున్నాడు.

ఇలాంటి వ్యక్తులను చాలా మందిని కలిశాం. ప్రతి వ్యక్తికీ చేయి చూపించుకోక పోయినా, ప్రశ్నలు మాత్రం వేసి, వాళ్లను వేదించటం జరిగింది (క్షమించాలి) ! చాలా మంది చాలారకాలుగా చెప్పారు. "లోకో భిన్నరుచిః" అన్న నానుడిని మరొక మారు నిరూపించారు వీళ్లంతా.

తమాషా అంతా చిలక ప్రశ్నలవాళ్ల దగ్గర. ఒక చోట పదహారేళ్ల అబ్బాయి చిలకలను పెట్టుకొని కూర్చొన్నాడు. మేము గట్టిగా రెండు ప్రశ్నలు వేసేసరికి, ఆ అబ్బాయి కొంచెం బెదిరి "నాకేం తెలియదు" అంటం మొదలెట్టాడు. "ఏయ్ నిజం చెప్పు. నీకు శాస్త్రం చెప్పటం నిజంగా వచ్చునా" అని అడిగేసరికి, "నాకు రాదు, ఈ రాతు చిలకకు వచ్చు" అన్నాడా అబ్బాయి.

శాస్త్రం పేరిట ఈ వృత్తిని వలంబించే వీళ్లలో ఎంతమందికి శాస్త్రం తెలుసును ? అన్న ప్రశ్నకు సరియైన సమాధానం దొరకలేదు. కొందరు పుస్తకాలు చదివామన్నారు. కొందరికి దేవి అనుగ్రహం వల్ల వచ్చిందట. కొందరికి వాక్శుద్ధి వల్లయీ "జ్ఞానం" వచ్చిందట. ఇంతలో ఇంతటి వైవిధ్యమా ? ఏం సమ్మానాలో ? కాని ఒక్కటి మాత్రం నిజం అనిపిస్తోంది. వీరి వేష భాషలు, ప్రవర్తన చూస్తే, వీళ్లలో చాలా మంది 'నాటకం' ఆడుతున్నారనే చెప్పవలసి వస్తున్నది ! రెండణాలు ఇచ్చి ప్రశ్న చెప్పించుకొనే సామాన్యుని మనస్సులోని ఆరాటం తెలిసికొన్న ప్రతి వ్యక్తీ ఈ వృత్తిని అవలంబించవచ్చునా ?— అన్న అనుమానాన్ని కలుగచేశారు వీళ్లు.

కొందరు నిర్దుష్టంగా జాతకాలు చెప్తున్నారు. డబ్బులు ఎక్కువ ఇస్తే పరీక్ష ప్యాసవుతావని, తక్కువ ఇస్తే తప్పుతావని చెప్పే వాళ్ళూ ఉన్నారు ! 'గోడ మీద పిల్లివాటం'గా చెప్పటం అందరికీ మామూలు అయిపోయినట్లున్నది ! "మిమ్మల్ని ఒక పెద్ద సమస్య వేధిస్తున్నది"



జంట సాముద్రికం...! మద్రాసు నగరంలో చాలా చోట్ల జ్యోతిషం చెప్పటంలో భార్యాభర్తలిద్దరూ సిద్ధహస్తులై వుంటారు. ఇతర ఉప వృత్తులువున్నా, చాలామంది జ్యోతిషాన్నే ప్రధానమైన వృత్తిగా స్వీకరించారట.



'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4″ × 2″, 4″ × 4″ చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

...ని మొదలుపెట్టి "ధైర్యంగా ఉంటే అదే తీరిపోతుంది'' అని ముగించేస్తున్నారు చాలామంది. అసలు సమస్యచేత వేధింపబడని మనిషెవరు ఈ లోకంలో ! ఎవరి తాహతుకు, స్థాయికి తగినట్లు— ప్రతి ఒక్కరికీ సమస్యలు ఏవో కొన్ని ఉండకపోవు. ఇదీ దీని రహస్యం !

కొన్ని విచిత్రమయిన దృష్టాంతాలు తారసపడ్డాయి. చిత్రాతి విచిత్రమైన బోర్డులను తగిలించుకొని ఈ వృత్తిని చాలా మంది సాగిస్తున్నారు. పేవ్‌మెంట్ల మీదనే గాక, ఇళ్లల్లో, భవంతుల్లో ఉంటూ ఈ కార్యక్రమం కొనసాగించే వారూ ఎందరో ఉన్నారు. ఒక చోట పన్నెండేళ్ల అబ్బాయి జాతకం చెపుతున్నాడు. రాసులూ, నక్షత్రాలు, వీటికి తోడు సాముద్రికమూ తెలుసును అతనికి. మరో చోట భార్యా భర్త కలిసి హస్త సాముద్రికం చెపుతున్నారు. మద్రాసు నగరమంతా వీళ్లతో నిండిపోయి ఉంది. వీళ్ల కొక సంఘం, దాని కొక కార్యవర్గమూ ఉన్నాయి. ఈ శాస్త్రానికి సంబంధించిన ఒక తమిళ పత్రిక కూడా వెలువడుతున్నది.

తాము ఇలా చేతులు చూచి, ఆ వచ్చే ప్రతిఫలంతో జీవయాత్ర చేయవలసి వస్తుందని వీళ్లందరకూ ముందుగా తెలుసా? తమ భవిష్యత్తును తామూ వూహించుకోగలరా ?

ఇదే ప్రశ్న వాళ్లనీ అడిగాను. తెలుసునన్నారు చాలా మంది. మరీగట్టిగా అడిగేసరికి ఒకరిద్దరు నీళ్లు నమిలారు ! ఒకాయన తాను లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షుణ్ణి కాబోతున్నానని చెప్పాడు. ఇలా ఎందరో ఎన్నోరకాలుగా చెప్పారు.

సమాన హక్కుల కోసం, ఇనుమడించిన గౌరవం కోసం స్త్రీలు పోరాడుతున్న ఈ రోజుల్లో — కొందరు స్త్రీలు కూడా హస్త సాముద్రికులయి ఉన్నారన్న వార్త ఆశ్చర్యకరం కాకూడదు. సిగ్గూ, బిడియమూ లేకుండా మగవాని చెయ్యి పట్టుకొని పరీక్ష చేస్తారు, తమకు తోచినవి చెప్తారు ! సలహాలిస్తారు ! హెచ్చరిస్తారు ! శబాష్ ప్రగతి శబాష్ !!!

* * *

మరి సోదెమ్మల మాట ఏమిటి? ఆంధ్రదేశంలో 'సోది' ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో బాగా ప్రచారంలో ఉంది. మద్రాసులో కూడా దాదాపు అలాంటి ప్రక్రియ ఒకటి ప్రస్తి జనాదరణ పొందింది. మద్రాసు మహానగరంలోనే కాస్త మారుమూల ప్రాంతాలకు వెళితే కనుపిస్తారు వీళ్లు ! ఈ 'సోదెమ్మ'లు ఎదుటి వారి మనస్సును గ్రహించటంలో సిద్ధ హస్తులని ప్రతీతి, వినికిడి.

శాస్త్రం ముఖ్యమా ? జీవనం ముఖ్యమా ?.. సాముద్రిక, జ్యోతిష శాస్త్రాలను ఉద్ధరించాలని వీటి ప్రాముఖ్యతను విరివిగా ప్రచారం చేయాలని ఆరాట పడేవారు వీళ్లలో ఎవరైనా ఉన్నారా ? అసలు, అలాంటి శ్రద్ధ వీళ్లకు ఉందా ?.... లేక వీళ్ల ఈ తిప్పలన్నీజీవనం కోసమేనా ?.... ఎవరైనా "తాము శాస్త్రాన్ని ఉద్ధరించేందుకు ఇలా వీధుల వెంట కూర్చున్నాం'' అని చెప్పినా అంత త్వరగా నమ్మలేము. కాని అలా ఎవరూ చెప్పలేదు ? తమకు జీవనమే ముఖ్యం అన్నారు. సాగరమంతటి సంసారాలున్నాయి వాళ్లకు. తమ కోసం, తమ పిల్లల భవిష్యత్తు కోసం ఈ వృత్తిని అవలంబించినట్లు చాలా మంది అంగీకరించారు. కాని ఒకరిద్దరు మాత్రం మొహమాటానికి కాబోలు "అయ్యో ! శాస్త్రం కూడా ముఖ్యమే'' అన్నారు.



ఇది భరత నాట్యభంగిమ కాదు - నగరంలో 'జ్యోతిషం' చెప్పే ఒక ఇంటి ముందున్న బోర్డు.

ప్రజల వద్ద ఎంతెంత పుచ్చుకొంటారన్నదీ గమనించ దగిన అంశమేననిపించింది. ఎవరి తాహతుకు తగినట్లు వాళ్లు పుచ్చుకొంటారు. రెండణాలో, నాలుగణాలో ఇస్తే చాలా మంది సంతృప్తి పడతారు. కొందరు రూపాయలు ముందడిగినా, బేరం చేస్తే, అణాకు దిగిపోతారు. ప్రొద్దుటి నుంచీ 'చిల్లి దమ్మిడీ' ఎరగని వాడయితే, ఎంతిచ్చినా సంతోషంగా పుచ్చుకొంటాడు. మరి అది అతని అవసరం !

ఈ నాడు మూడు వేల మంది వ్యక్తులు ఈ వృత్తిని ఆలవాలంగా చేసికొని జీవించటంలో ఒక రకంగా, ఇక్కడి ప్రజలకు ఈ శాస్త్రం మీద ఉండే అపారమైన నమ్మకం కూడా విశదమవుతుంది. పైగా, ప్రజల జీవన పరిస్థితులు కూడా, కొన్నిసార్లు, ఈ సాముద్రికులను సంప్రదించమని ప్రోత్సహిస్తాయి. కష్ట నష్టాల మధ్య నలిగిపోయే వ్యక్తికి ఒక్కోమారు జ్యోతిష్యులు చెప్పే 'మంచి మాటలు' కొంత ఉత్సాహాన్ని కల్పించవచ్చు కూడా!

మనం, మానవులంగా, నిర్వర్తించవలసిన కార్యక్రమాలను నిర్వహించకుండా భవిష్యత్తులో ఏదో వస్తుందని ఆశించి, దేనికోసమో ఇప్పటి నుంచే ఎదురు తెన్నులు చూచేందుకు బదులుగా, సాముద్రికులను తడవ తడవకూ చూడటం, వారు చెప్పిన మాటలను ఆధారం చేసికొని గాలి మేడలలో తేలిపోతూ ఉండటంలో ఔచిత్యం ఉండీ ఉండకపోవచ్చును. ఔచిత్యం, అనౌచిత్యాలను ఇక్కడ ప్రస్తావించటం అప్రస్తుతం అనుకొంటా.

ఏమయినా —

తన భవిష్యత్తును గురించి తెలిసికోవాలన్న కోరిక మానవునిలో ఎక్కువవుతున్నంత కాలం, మద్రాసు నడి వీధిలోనే గాదు, మరో ఆకాశంలోనైనా, లేదా నట్ట నడిసముద్రంలో నైనా ఈ సాముద్రికులకు చోటు ఉండటంతథ్యం— ఇది ముమ్మాటికి నిజం ! ★



బస్తీకొచ్చిన 'కొండరాజు'లు కూడా, రోడ్డుప్రక్కన కూర్చుని జనాన్ని ఆకర్షిస్తూ శుభం చెప్తూవున్నారు.




భూపతి

**అ**సురసంధ్యవేళ కన్నీరు పెట్టకూడదు...

ఈ సంగతి సుశీలకి తెలియనిది కాదు. ఆమె విషాదజీవితానికి, తరగని కన్నీటికీ, తీరని ఆవేదనకు ఆ పట్టింపులేమీ లేవు. మిగిలినది, చెయ్యగలిగినది కన్నీరు కార్చడమే అయినప్పుడు అంతకన్నా చేయగలిగిందేముంటుంది!!

సుశీల భారంగా నిట్టూర్చి, కన్నీటిని చేత్తో తుడుచుకుంది. ఆమె దృష్టి చేతులమీదికి మళ్ళింది.

"—సుశీలా—నీచేతిలో అమృతం ఉంది సుమా!" అన్న భర్త మాటలు గుర్తుకు వచ్చాయి. ఆమె మనసు కొన్ని సంవత్సరాలు వెనక్కి లాగింది.

—హార్మోనియం ముందు కూర్చుని తను సంగీతం పాడుకుంటుంటే—ఎవరో ఒక వ్యక్తి, రోజూ తన ఇంటి ముందు, గుమ్మం ముందు తారట్లాడుతుండే వాడు. కొన్నాళ్ళు చూశాక తనకి అనుమానం వచ్చింది. ఆ రోజు తను సంగీతం పాడుకుంటుంటే అతనువచ్చి నేరుగా గుమ్మం ముందు నిలబడ్డాడు. తనకి కోపం పైకి లేచి పోయింది. పాట ఆపి, వచ్చిన కోపాన్ని దిగమింగుకుంటూ, "ఎవరండీ, ఏంకావాలి?" అని అడిగింది. అతనికి ఏంకావాలి? ఏమీ చెప్పలేక, 'ఎవ్వ—

ఏమీ లేదూ—కొంచెం మంచి నీళ్ళు కావాలి—దాహంవేస్తోంది'' అని అడిగాడు. తను అతనికేసి పరీక్షగా చూసింది. మామూలు ఎత్తు—గ్లాస్కో చొక్కాలోంచి కనిపిస్తున్న కండలు తిరిగిన శరీరం జనపాలు—కలకత్తా చెప్పులు— పోస్కోలు లక్షణంగానే ఉన్నా— తనకెందుకో అలాగనిపించలేదు. మంచి నీళ్ళు తెచ్చి ఇచ్చింది. గ్లాసు అందుకునేటపుడు అతను తనకేసి, తనచేతులకేసి చూసిన చూపు— ఆనక కాలవగట్టు పక్కనున్న చెట్టుకింద రాయిమీద కూర్చుని—తను ఆ దారివెంట వచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడు చూసిన చూపులు — నెల తిరిగే లోపున తేలింది..... అదే వ్యక్తిముందు పెద్దల సమక్షాన తను గొంతెత్తి—— 'అదే' కృతి అతను కోరింది— పాడింది— పెద్దలూ పెద్దలూ శుభం అనుకున్నారు. ముప్పై ఎకరాల మాగాణి ఉన్న ఆసామి ఇట్టే వచ్చి అట్టే వప్పుకున్నాడు — సుశీల ఎంత అదృష్టవంతురాలో అనుకున్నారు జనం— ఔను అప్పటిలో తనూ అలాగే అనుకుని మురిసి పోయింది.

... సుశీల చిన్నగా నిట్టూర్చి, గదిదాటి పెరట్లోకి వచ్చి—మల్లె పందిరి పక్క మంచం వాల్చుకుని కూర్చుంది.

"నిండు పూర్ణిమ—విరబూసిన మల్లెలు"

— "మల్లెలు" అనుకుంది సుశీల మల్లె పూలని ఆప్యాయంగా చూస్తూ... ఇవే మల్లె పూలు ఆ నాడు తన జడ నిండా అలంకరించారు. పెళ్లి కూతుర్ని చేశారు చాలా పెళ్ళిళ్లు చూసిన తను (ఆ రోజుల్లో) పెళ్ళికూతుళ్ళకు— "అంత సిగ్గు దేనికి? సరిగ్గా కూర్చోలేరు? రాజులా, రోజులా నిబ్బరంగా ఉండలేరా? పీటలమీద ఎందుకలా మెలికలు తిరిగి పోతారు?" అనుకుంది— కానీ అలా అలా ఎందుకు మెలికలు తిరుగుతారో తన కిప్పుడు బోధపడింది. తనూ అంతే చేసింది. ఆ ఆలోచన వల్ల తన ముఖం మీద చిరునవ్వు వెలిసింది. అది పసిగట్టి—పక్కింటి సుగుణ—"ఏమమ్మా! అంత హొయలు—ఎందుకా నవ్వు? ఇక్కడే అంత అందం చూపించక— ముందుంది సమయం" అని హాస్యం చేసింది. తనకేం మాట్లాడాలో తెలీక, "ఫోవే, నువ్వు మరీను" అంది. మామూలు సమయాల్లో అయితే తను మాటకి మాట అంటించగలదు.

సుశీల మంచంమీంచిలేచి వెళ్ళి పెరడంతా ఒక్కసారి తిరిగివచ్చి మళ్ళా మంచంమీద కూర్చుంది. దూరంగా ఎక్కడనుంచో బాజాలు వినబడ్డాయి. "పెళ్ళి బాజాలు గావాలు" అనుకుంది—ఆమె మనస్సు పెళ్ళి బాజాలవైపు లాగింది.

—పెళ్ళి బాజాలు ఉన్నట్టుండి ఆగిపోయాయి. ఆ గోల ఆగడానికి కారణమైన ఒక గొంతు వినుచుకు నడింది. ఆహూతులందరూ శ్రోతలై ఆ కంఠం సొంతదారునికోసం చూశారు.

"వీల్లేదు—అనుకున్న ప్రకారం అన్ని జరిగి తీరాల్సిందే!" అన్నాడా కంఠం సొంతగారు. ఆ కంఠం సుపరిచితమైన దవడంవల్ల తను—తల ఎత్తే నవసరం లేకుండానే గ్రహించింది.

"పెళ్ళికొడుక్కి ఏమౌతాడో ఆయన" అన్నారు. కొందరు పెళ్ళిళ్లలో అభాసు చేసేది మగ పెళ్లివారే అన్న స్థిర నిశ్చయంతో, ధీమాతో.

"పెళ్లి కొడుక్కి ఏమీకాడు. పెళ్లికూతురు మావయ్యట—" అన్నారు అప్పటి కప్పుడే వాకబు చేసినవారు.

"కుదరదు— మేమిస్తానన్న కట్నం ఇవ్వలా! గోళ్ళూడగొట్టి మరీ పుచ్చుకున్నారే! చిన్నమొత్తం బంగారం తక్కువయినాసరే ఈ పెళ్లి జరగడానికి వీల్లేదు" అన్నాడాయన. తన పక్కన మంగళసూత్రం చేతో పట్టుకుని నిలబడ్డ 'ఆయన'కు కోపం వచ్చింది. దాన్ని అక్కడ పారేసి పీటదిగి, జనంలో కలిసిపోయారు. తనకి శరీరం పట్టుతప్పింది. కళ్ళు చీకట్లు కమ్మినట్లు అయ్యింది. ఇంతలో ఒకాయన ఆపద్బాంధవుడిలా పరుగున వచ్చి—ఆయన్ని, తన మావయ్యని శాంతపరచి, ఆనక ఒకావిడ దగ్గరకెళ్ళి, ఆవిడ మెళ్లో నెక్లసు, చేతి గాజులూ తీసుకుని, తన మావయ్య చేతిలో పెట్టారు. ఆయనే పెళ్ళికొడుకు అన్నగారు అని ఎవరో అంటున్న ముక్కలు తనకి లీలగా విని పించాయి.

"మాంగల్యం తంతు......" నవ్యంగానే జరిగింది. బావగారికి తను మనస్సులో వేయి నమస్కారాలు చేసుకుంది.

మిగతా శుభకార్యాలు పైయేటికి అని పెద్దలనడంవల్ల తను పుట్టింట్లోనే ఉండిపోవలసి వచ్చింది. ఉన్న ఎకరం పొలం అమ్మి తన పెళ్ళికి కట్నంగా యిచ్చినదానికి బదులుగా వచ్చిన నగలను భద్రంగా తన తల్లి దాచింది. సంవత్సరం తిరిగొచ్చేలోగా తన అన్న నరసింహారావు పట్నం చదువు మధ్యలో ఆపి ఏడుపుముఖంతో తిరిగి వచ్చేశాడు. అతను అలా రావడం ఎవరికి ఆశ్చర్యం కలిగించక పోయినా, ఆనందం కలిగించలేదు. చదువు ఆపి, వచ్చిన అన్నగార్ని పలకరించడానికి తనకి ధైర్యం చాలలేదు. పైగా అన్నయ్య కోపిష్టి అని తనకి భయం కూడాను. ఆ సాయంత్రమే మామయ్య వచ్చాడు. వస్తూనే పొద్దున నుంచీ చర్చలేక పడున్న విషయాన్ని బయటకు లాగి, "ఛీ—ఛీ— ఇన్నాళ్ల చదువూ ఇలా బూడిదపాలైతే ఎలారా గాడిదా" అన్నాడు. అన్నయ్య విసుక్కున్నాడు. డబ్బులేందే సుద్ద ఉచితంగా భోజన సదుపాయాలతో సహా అడ్డమైన వాళ్లకి చదువు చెప్పించే అంత ఉదారస్థితికి, దేశం ఇంకా రాలేదన్నాడు. అలాంటి అవకాశం వస్తే—తను అప్పటికి బ్రతికుంటే తప్పక చేరతానన్నాడు. తను ఆ మాటలన్నీ తన గదిలోంచే వింది. ఆనక తన తల్లీ—మేనమామా ఏవేవో గుసగుస లాడుకున్నారు, తనకవి వినిపించలేదు. ఆనక, "పోయిందేవిటి ? అడుగుదాం—" అన్నమాట, వెనువెంట "సుశీలా! ఓసారిలా రావమ్మా" అన్న పిలుపు వినపడింది. తను లేచి వాళ్ల దగ్గర కెళ్లింది. మావయ్య చెప్పవలసినదంతా టూకీగా చెప్పి—"నువ్వేం భయపడ నక్కర్లేదు—ఉత్తినే చేతి మార్పిడి—నువ్వు కాపరానికి వెళ్ళేలోగా నీ సొమ్ము నీతోనే ఉంటుంది. పైగా వాడేవడూ కాదు. నీ సొంత అన్నయ్యే కదా" అన్నాడు. తనకి ఏమని సమాధానం చెప్పాలో తోచలేదు. ఆలోచించుకోడడానికి తనకు అవకాశమూ, ఆశక్తి కూడా లేవు. అన్నయ్య తనకేసి ఒక్కసారి చూసి పక్క గదిలోకి వెళ్లిపోయాడు. మేనమామా, తల్లీ తనని వూదరగొట్టారు. పర్యవసానంగా తన చేతులతో తనే—పెళ్లినాటి అవాంతరంలో అడ్డుపడి, బావగారు తన భార్య చేతుల మంచి తీసిచ్చిన గాజుల జత—మావయ్య చేతులో పెట్టింది. ఆరోజే అన్నయ్య వెళ్లిపోయాడు. వెళ్ళేటపుడయినా తనతో ఒక్కమాట చెప్పలేదు. తన మనస్సు చివుక్కుమన్నమాట నిజమే. కాని, అతని తత్వమే అంతని సరిపెట్టుకుంది. నెలకో ఉత్తరం, దానికి సమాధానంగా ఒక నగ చొప్పున అన్నయ్య చదువు సాగింది.

వేసంగు లొచ్చాయి. అన్నయ్య రాలేదు. పట్నంలో ఉద్యోగం దొరికిందని అతను రాసిన కార్డు మాత్రం వచ్చింది. మిగిలిన శుభకార్యాన్ని పూర్తిచేసుకుని, అమ్మాయిని తీసుకువెళతాం అని వాళ్ళు కబురు చేశారు. ఆనాడు అమ్మ నెత్తీ నోరూ బాదుకుంది. మామయ్య అట్టే ఆలోచించి ఏదో సాకుచెప్పి—పై సంవత్సరానికి శుభకార్యాన్ని వాయిదా వేయించాడు. ఆ సాకు ఏమిటో తన కికప్పటికీ తెలియదు. ఎవరూ చెప్పలేదు కూడాను. పైయ్యేడు గిర్రున తిరిగి వచ్చింది. మళ్ళీ కబురు వచ్చింది. మావయ్య పట్నం వెళ్లొచ్చి నట్టింట్లో గయ్యిన లేచాడు. అన్నయ్యని నోటి కొచ్చినట్టు తిట్టాడు. పర్యవసానం— అన్నయ్య తన దగ్గర చిల్లిగవ్వ కూడా లేదన్నాడని చెప్పాడు.

"ఇప్పుడేం చెయ్యాలి" అంది అమ్మ గాభరాగా.

పక్కగదిలోంచి వింటున్న తనకు ఏంచెయ్యాలో తెలీకపోయినా, ఏమవుతుందో మాత్రం చక్కగా తెలిసింది. అత్తారు పెట్టిన నగలు వాడుకుని అగచాట్లుపడ్డ—పక్కింటి సుగుణ (లాంటివాళ్ళు) చెప్పగా తను వింది. ఆ గతి తనకే వచ్చిందని ఆ రాత్రంతా కంటికీ మింటికీ ఏకధారగా ఏడ్చింది. మామయ్య ఏం లోపాయకారీ పని చేశాడో నగలన్నీ సిద్ధంగా ఉన్నాయని కబురు పెట్టాడు. "అంత డబ్బు నీ కెక్కడిదిరా అని తన తల్లి అడిగితే "దొంగతనం చేశాను. ఎక్కడిదైతే నీ కెందుకు— ఏం ఆమాత్రం ఓ నెక్లెను, రెండు జతల గాజులూ—ఏదో ఇంకో లేవిటి—ఆమాత్రం నగలు తెచ్చే అంత డబ్బులేనివాణ్ణా" అని విసుక్కున్నాడు. మావయ్య తనకోసం అంత త్యాగం చేస్తాడని తను వూహించలేదు. "ఏమయితేనేం— నా నగలు నా కొచ్చాయి అదే చాలు" అనుకుంది తను ఆనందంగా.

—వూహాలోకంలో ఉన్న సుశీల తల్లి పిలుపుకి ఉలిక్కిపడి—"ఆ వచ్చే వచ్చే" అంటూ గమ్మున వెళ్లి తలుపు తీసింది. రత్తమ్మగారు కూతురు ముఖంచూసి, "ఏం తల్లీ—ఎందుకలా మనస్సు బాధపెట్టుకుంటావు—మంచి రోజులు ఎప్పటికీ రాకనే పోతాయా ఎవర్నని ఏం లాభం ? నా చేతులారా నేనే నీకు అన్యాయం చేశాను" అంటూ కంట తడి పెట్టుకుంది. తల్లి మనస్సును నొప్పించినందుకు సుశీల బాధపడింది. "లేదమ్మా —ఒంటరిగా కూర్చుంటే దిగులనిపించింది." అంది పూడిన గొంతుతో.

రత్తమ్మగారికి తన కూతురు గుణం తెలియక పోలేదు. ఇతరుల మనస్సు నొప్పించకూడదనే బుద్ధి కలది తన కూతురని తెలుసు. "నాకు తెలీదా తల్లీ— నీ నూరేళ్ల జీవితాన్ని నా చేతులతో నేనే నాశనం చేశాను. ఈనాడు ఎవర్నని ఏం లాభం—పదమ్మా కొంచెం ఎంగిలిపడుదువుగాని" అంటూ కన్నీళ్లు తుడుచుకుంటూ వంటింటికేసి నడిచింది.

సుశీల వెంగిలిపడి తన గదిలోకి వెళ్లి మంచం మీద కూర్చుంది. ఎదురుగా గోడకి పెళ్లినాటి పటం వేళ్లాడుతోంది. పటంమీద సాలె పురుగు గూడు కట్టుగోడానికి పథకం ఏర్పాటు చేసుకుంటోంది. సుశీల లేచి, సాలెపురుగును విదిలించి పటాన్ని కొంగుతో తుడిచి, పటం వంక తేరబారి చూడసాగింది.

## కన్నీరు

"ఆయన వంగి, తన మెళ్లో మాంగళ్యం కడుతున్నారు."

సుశీల తన మంగళసూత్రాన్ని కళ్ల నద్దుకుంది.

—ఆవేళ రాత్రి .... సుశీలా, నీ చేతిలో అమృతం ఉందిస్మీ—అన్నారు. తన చేతిని ఆప్యాయంగా పట్టుకుని. "ఏదీ అమృతం" అంది తను చేతిని తిరగా, బోర్లా వేసి చూసుకుంటూ. ఆయన ఫక్కున నవ్వుతూ "చేతిలో అంటే బయట చూసుకుంటావేం—" అన్నారు తనని దగ్గరగా లాక్కుంటూ.

అత్తారింటికి వెళ్లిన మొదటి రోజుల్లో తనకి

చాలా భయంగా ఉండేది. పైగా ఆయన తెల్లవారుఝామున లేచి, కసరత్తు చేసేవాడు. కసరత్తు చేసేవాళ్ళకు గుండె ఉండదని, కసాయితనం జాస్తి అనీ చిన్నప్పుడు కథల్లో అమ్మమ్మ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చేవి. అప్పుడవి నమ్మినా, ఆయన్ని చూశాక అవన్నీ శుద్ధ తప్పనిపించాయి.

ఆయన కసరత్తు చేస్తారనీ, కుస్తీలు పడతారనీ గిట్టనివాళ్ళంటే, తాగుతారనీ—ఇంకా .... అని అని, అన్నీ చెడ్డగుణా లుండడంవల్లే—అయిన వాళ్ళు— మేనరికాలు వదులుకున్నారనీ— గిట్టని వాళ్ళు అనేవారు. నీలాటిరేవులో తనలాటి మాటలు చాలా విన్నా, తేలిగ్గా నవ్వేసేది. ఆయన తన నెప్పుడూ చెడ్డగా చూడలేదు. పల్లెత్తుమాట అనలేదు—

సుశీల లేచి, లైటార్పేసి, నిద్ర కుపక్రమించింది.

నిద్ర— వెధవనిద్ర వస్తే బావుణ్ణు—కాని, అదెందుకు వస్తుంది ? రాదు—పాపం—అమ్మ .... అమ్మని బాధపెట్టకూడదు—అసలే పెద్దకాలం— అన్నయ్య చదువుకుని, ప్రయోజకుడౌతాడని ఆశ పడింది. అయ్యాడు. కానీ, అయినవాళ్ళకు కాలేదు. దానికి అమ్మేం చేయగలదు.... నగ అమ్మమని ప్రోత్సాహం చేసిన మామయ్య కూడా మాట పట్టింపుతో మాట్లాడ్డం మానేశాడు—అమ్మకి ఉన్నది తనొక్కర్తే .... తనకున్నది ?!

సుశీల నిద్రపట్టక, పక్కమీంచి లేచి లైటువేసి, తన పెట్టె తీసి, భద్రంగా దాచిన ఒక ఉత్తరం తీసి, మళ్ళీ చదువుకుంది .... అవే ముక్కలు ప్రతి అక్షరంలోనూ పంతం, ఔదార్యం కనిపిస్తున్నాయి. ఉత్తరం పూర్తిగా చదివి, దాచేసి, లైటార్పి పక్క మీద కూర్చుంది. ఆమె మనస్సు మళ్ళీ గతంలోకి చొచ్చుకుపోయింది.

—ఆరోజు .... ఛ, ఆరోజు రాకపోయినా బావుండేది. వచ్చినా, తను పేరంటానికి సిద్ధం అవక పోయినా పోయేది .... హ్హు. విధి రాత తప్పించ గలిగింది ఎవరు .... పేరంటానికి తను వెళితే లోగానే పక్కింటి విశాలాక్షమ్మగారు వచ్చింది. పేరుకుతగ్గ కళ్ళు — వస్తూనే— 'గమ్మున తెమ లమ్మడూ' అంటూ టేబులుమీదున్న నెక్లసు తీసి చూస్తూ "ఎన్ని కాసులే పిల్లా యిది" అంది. అప్పుడే లోపలకు వస్తున్న అత్తగారు ఎన్ని కాసులో చెప్పింది. విశాలాక్షమ్మగారు ఆమాట వింటూనే ఆశ్చర్యపోయింది. పోవటంతో ఆగక, నెక్లసు అన్ని కాసు లుండదని సవాలు చేసింది. మరోక్షణం నెక్లసుని పరీక్షగా చూసి "ఇదసలు బంగారమేనా" అని అడిగింది. ఆమాటకి తను ఉలిక్కిపడింది. అత్తగారు గయ్యిమంటూ ఆవిడ చేతి లోంచి నెక్లసు తీసుకుని, తిరగా బోర్లా వేసి చూసింది. ఆవిడ ముఖం రంగులు మార్చుకుంది పెద్దకోడలు లక్ష్మిని కేకేసి, "పెళ్ళినాడు నీ ఆయన నీ మెళ్ళోంచి తీసిచ్చిన నెక్లసు యిదేనా" అని అడిగింది. లక్ష్మి నెక్లసును అటూ యిటూ తిప్పి "ఛ" అంది గమ్మున.

సాయంత్రం దాటి దీపాలు పెట్టే వేళ్ళకల్లా తన నగలతో గిల్టు నగలెన్నో కంసాలి పాపారావొచ్చి అధికారపూర్వకంగా తెలియజేశాడు. తన శరీరం భయంతో వణికిపోయింది. ఆనాడు మావయ్య చేసిన పని తనకు గుర్తు వచ్చింది. గదిలో కూర్చుని, భయంకర భవిష్యత్తును తలుచుకుంటూ వెక్కి వెక్కి ఏడ్చింది. రాత్రి పొలం నుంచి వచ్చిన 'ఆయన్ని' పిలిచి, అత్తగారు జరిగిన విషయమంతా చెపుతుండగా తను చెవులారా వింది. మరి కాస్సేపటికి ఆయన తన గదిలోకి వచ్చారు. వస్తూనే గది విరిగేలాగ, "ఏం సుశీలా—అమ్మ చెప్పిందంతా నిజమేనా" అన్నారు. తను నోరెత్తి మాట్లాడేలోగా తన చెంప చెళ్ళుమంది. వరసన రెండు మూడు పడ్డాయి. ఆనక "ఛఛ" అనుకుంటూ ఆయన వెళ్ళిపోయారు. రెండు వారాలైనా నిండని తన దాంపత్యజీవితానికి ఆవిధంగా సొద్దు పడింది. ఆ రాత్రంతా తను కన్నీటితోనే గడిపింది. తెల్లవారుతూనే ఇంట్లో పంచాయితీ ఏర్పాటయ్యింది. ఎవరికి తోచిన ముక్కలు వాళ్ళు చెప్పారు. "ఏమైనా సరే ! నగలు తిరిగి యిచ్చితీరాలి. నగలు వాడుకున్నదే గాక, గిల్టు నగలు పెట్టి పంపుతారా ! ఎంత దగా !" అన్నా రాయన. తన అత్తగారూ అదేమాటంది. "నగలన్నీ తెచ్చిస్తేగాని, అమ్మాయిని ఏలుకోడం కుదర్దని" తన తల్లికి, మామయ్యకీ కబురు పెట్టారు. రాత్రికల్లా మామయ్య వచ్చాడు; వస్తూనే విరుచుకుపడ్డాడు.

"కట్నం క్రింద మే మిచ్చిన డబ్బు మీరు మీ యిష్టం వచ్చినట్లుపయోగించుకోలేదూ ? ఏదీ ! ఆ డబ్బిలా తెండి చూద్దాం—అలాగే మేమూ ప్రాణావసరానికి ఆ నగలు మేంఉపయోగించుకున్నాం. ఎటొచ్చి కాస్త కాలూ చెయ్యీ కూడగట్టుకున్నాక బంగారం నగలే చేయిచ్చేస్తాం—ఈలోగా పెట్టుకో డానికి ఉండవని బోలెడు ఖరీదు పోసి కొన్నాను. బంగారం అయితే వంటికి అంటుతుందా, ఇది అంటకపోతుందా ఏమిటి— ఈమాత్రం దానికి అమ్మాయిని ఏలుకోమని కబురు చెయ్యాలా— తెలికడుగుతాను—అసలు మీవాడికి పెళ్ళయిందని ఆనందించడానికి పోయి, ఇదో ఇది కూడానా— వదిలేస్తాడట—వదిలేస్తాడు. అసలు పిల్లనివ్వ సాహసించింది ఈ చుట్టుపక్క ఊళ్ళల్లో ఎవరు ? మేం ఇచ్చాం తప్ప—" అంటూ జబ్బలు చరిచాడు. దాంతో ఆయన తోకతొక్కిన తాచులా లేచారు. మాటలు సరిహద్దులు దాటి చేతులు కలిపేదాకా వచ్చాయి. పంతాలు ఎక్కువయిపోయాయి. "బంగారం అంతా లెక్కగా యిచ్చేదాకా—అది ఈ గడప తొక్కడానికి వీల్లేదు" అన్నారాయన — తల్లి మాటను బలపరుస్తూ. మావయ్య ఇంకా ఇంకా రెచ్చిపోయాడు. పర్యవసానంగా తన పెట్టె, బేడా—ఆవేశంలో ఆయన విసిరేసి, "ఇదిగో, నగ లన్నీ లెక్కగా ఇవ్వడమే గాకుండా—క్షమార్పణ చెప్పుకుంటేగాని ఈ గడప తొక్కలేవు" అన్నారు. అత్తగారు ఆయన్ని వారించలేదు. 'అన్న' గారు కలగ జేసుకుని, తప్పని వారించినా ఆయన వినలేదు. పైగా అన్నగారిమీద విరుచుకుపడ్డారు. అన్నదమ్ము లిద్దరికి సంఘర్షణ ఏర్పడింది.

పర్యవసానంగా—పెదనాన్న ఎక్కివచ్చిన బండి లోనే తన ప్రయాణం ఖాయమయ్యింది. ప్రతివాల దానికి అవకాశం లేకుండాపోయింది.ఆయన ఇంట్లోంచి వెళ్ళిపోయారు. అత్తగారు పొరుగింటికి వెళ్ళి పోయింది. దారి పొడుగునా తను వెక్కివెక్కి ఏడుస్తూనే ఉంది. ఏ సుముహూర్తాన్న తన జీవితంలో దుఃఖం ప్రారంభమయ్యిందో కాని, నిర్విఘ్నంగా నెలవు ఏర్పాటు చేసుకుంది.

— ఆలోచనా తరంగాల్లోంచి నిద్రాసముద్రం లోకి పోయి, మేలుకునేసరికి తొలికోడి కూసింది. "అబ్బ— రోజులెలా గడుస్తాయో—" అనుకుంటూ సుశీల గది దాటి పెరట్లోకి వచ్చింది. తిరిగి ఆమె మనస్సు తన స్థితిలోకి వెళ్ళిపోయింది.

.....ఆనాడు— తన బావగారు— తన పాలిట దేముడు— ఆయనవచ్చి "కనీసం నగలు వాడుకున్నట్లు రాసిచ్చినా — తమ్ముడు ఒప్పుకుంటాడనీ ఆ మాత్రం రాసివ్వడం ఏమంత కష్టంకాదనీ— చూస్తూ చూస్తూ పండంటి కాపురం చేతులారా నాశనం చేసుకోడం మంచిదికాదనీ చెప్పారు.



ఆయన వెళ్ళాక— తను, తల్లీ, కొండంత సంబరం పడ్డారు. మావయ్య వచ్చి విషయం తెలుసుకునే సరికి చప్పరించాడు. నగలు ఎవరు వాడుకున్నారో వాళ్ళే సంతకం చెయ్యాలని— చేస్తే అర్థం ఉంటుంది కాని— మధ్యలో తను రాసివ్వడం ఏమిటని— రాసివ్వ వని చెప్పాడు. మాటా మాటావచ్చి మాటలు పోయాయి.

వెర్రి తల్లీ— తప్పంతా నాది. వాడెంత నాకు తమ్ముడయినా—ఇలాటి వాటిల్లో ఇరుక్కునేటంత వెర్రివాడు కాదే— తప్పంతా నాది— ఎవర్నని ఏం లాభం— ఆ వెధవ చదువుకోసం నీ సుఖాన్ని, నూరేళ్ల జీవితాన్ని ఎరపెట్టి బలిపెట్టాల్సి వచ్చింది'' అంటూ తన తల్లి కంటికీ మింటికి ఏకధారగా ఏడ్చింది. ఎందరు ఎంత ఏడుస్తే మాత్రం ఏంలాభం— ఫలితం శూన్యం— మర్నాడు, మూడోనాడూ ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చి అమ్మ అన్నయ్యకి ఒక ఉత్తరం రాసింది. ఆ ఉత్తరం తెచ్చే ప్రత్యుత్తరంమీదే తన భవిష్యత్తు నిర్ణయం అయి ఉంది. కళ్లు కాయలు కాసేలాగ వారం రోజులనుంచి రోజూ జాబుకోసం ఎదురు చూస్తోంది తను.

''ఏవే సుశీలా, రాత్రంతా ఇలా పెరట్లోనే కూర్చున్నావా? నిద్రపోలేదూ'' అన్న తల్లి మాటలకు వులిక్కిపడి,'' ''లేదమ్మా— ఇప్పుడే లేచాను.'' అంది పూడిన గొంతుకతో.

రత్తమ్మగారికి కూతురు స్థితి చూసి, కడుపు తరుక్కుపోయింది. అయినా ఆవిడ చెయ్యగలిగి దేమీలేదు— కన్నీరు విడవడం తప్ప. ఆవిడ శోకం ఆగ్రహరూపం దాల్చి కొడుకుమీదికి మళ్ళింది.

''ఛీ—దరిద్రుడు—నా కడుపున చెడపుట్టాడు. ఆడపిల్ల నగలమ్మి చదివిస్తే చదువుకుని, ఈనాడు చెల్లెలు పంటలాంటి సంసారం చెల్లాచెదరైపోతుంటే పట్నంలో సంపాదించుకుంటూ కులుకుతున్నాడు— ఛీ!'' అంది.

సుశీల కారే కన్నీటిని ఒపుకుంటూ, కారిన కన్నీటిని తుడుచుకుంటూ, ''పోనీలేమ్మా డబ్బు కోసం ప్రయత్నిస్తున్నాడేమో!'' అంది అతను అలాటి ప్రయత్నాలు చెయ్యడని దృఢంగా నమ్మకం ఉన్నా.

రత్తమ్మగారికి మాటలు వచ్చలేదు.

''డబ్బెందుకే! వెధవ డబ్బు— నగలు వాడు

# కన్నీరు

కున్నట్టు కాయితంమీద రాసిస్తే చాలని వాళ్లంటే మన అదృష్టంకొద్దీ వాళ్లు— చీటీ ముక్కమీద రాసిస్తే చాలన్నారు కదా వాళ్లు— ఏం ఆ మాత్రం రాయడానికి చేతులు రాకపోయాయా! మనం జాబువేసి వారంపైన అయ్యిందికదా—ఛీఛీ'' అంది ఆవిడ.

* * *

భోజనాలయ్యాయి.

వారం పదిరోజులనుంచి జరుగుతున్న దినసరి కార్యక్రమం ప్రకారం సుశీల తన గదిలో మంచం మీద పడుకుని, గతాగతాలను ఆలోచిస్తూ, వూహిస్తూ కన్నీరు కార్చసాగింది.

—అత్తవారిల్లు— అత్తారింటికి వెళ్ళాలి— వెళుతున్నాను—వెళ్ళాను— అని సంబరపడ్డ కాలం పట్టలేదు. తిరిగి వచ్చెయ్యడానికి. అత్తవారింట్లో నడుచుకోవలసిన పద్ధతులూ, అత్తగారికి తనమీద మంచి భావం కలిగేలా చేసుకునే పద్ధతులు భర్త అనురాగం పొందడానికి నడుచుకోవలసిన రీతులమీద తన మనస్సు చెప్పిన పాఠాలన్నీ వ్యర్థమైపోత యని కల్లోకూడా వూహించలేదు. తన సుఖాలన్నీ ఒక్కుమ్మడిగా చెరి, స్వల్పకాలంలోనే తనను వదిలి వెళ్ళిపోయాయి. పోతూ పోతూ— తన వంటరితనాన్ని చూసి జాలిపడి, తీరని దుఃఖాన్ని తనవంటరితనానికి జంటగా పంపాయి..........

సుశీల భారంగా నిట్టూర్చి— పక్కమీంచి లేచి పెట్టె తీసి 'ఆ' ఉత్తరాన్ని తీసి మళ్ళీ చదువుకుంది. అవే మాటలు, అవే ముక్కలు..........

—పంతాలు వచ్చాయి గనుక పంతాలుగానే సాగాలి. ఆనాడు మీ మావయ్య వచ్చినపుడు ఆయనలా మాట్లాడకపోతే ఇంతగోల అయ్యేదికాదు. జరిగిందేదో జరిగిపోయింది. ఈ విషయంలో అమ్మ చాలా పట్టుగా ఉంది. కానీ అన్నయ్య మంచితనం నా పంతాన్ని కరిగించింది. నిన్ను కావాలని పెళ్ళిచేసుకున్నాను. నిన్ను వదిలిపెట్టి— వేరే పెళ్ళి చేసుకోవాలని నాకు గనుక అభిప్రాయం ఉంటే నిన్నసలు పెళ్ళిచేసుకోక పోదును అంతమాత్రంచేత— నేను తాగుబోతుననీ తిరుగుబోతుననీ, నా కెవ్వరూ పిల్లనివ్వరనీ— మీ

మావయ్య అన్నమాటలు గుర్తుకు వచ్చినప్పుడల్లా.. పోనీలే.......అవన్నీ తవ్వడం ఎందుకు?— నగల మీ వాళ్లు వాడుకున్నట్లు— మీ మావయ్యగానీ, మీ అన్నయ్యగానీగానీ రాసిస్తే— నువ్వు మా ఇంటికి రావడానికి మా అమ్మను వప్పించాను. ఈ మాటే అన్నయ్యతో మీకు కబురుపెడుతున్నాను. తొందరలో ఆ ఉత్తరం రాయించుకుని— కబురు చేయగలవనుకుంటాను— ఇదేమంత కష్టమైన పని కాదు............

''ఇదేమంత కష్టమయిన పనికాదు''. అనుకుంది సుశీల నిస్పృహగా.

ఏమో! ఎంత ఇదైనా— తోబుట్టువు కదా! తన చెల్లెలు సంసారం నాశనమైపోతుంటే ఏ అన్నయ్య చూస్తూ వూరుకుంటాడు— అప్పుడే ఉత్తరం రాసి వారం అయ్యింది. సమాధానం తప్పక రావాలి.

ఆలోచనా తరంగాల్లో ఉన్న సుశీల 'పోస్ట్' అన్న కేకకి ఉలిక్కిపడి, 'వస్తేవచ్చే' అని కేకేసి, గదిదాటి బయటికి వచ్చింది. హాల్లో నిద్రపోతున్న రత్తమ్మగారికి ఇవేమీ భంగం కలిగించలేదు. పోస్టుమాన్ అప్పుడే కవర్ని విసిరి వెళ్ళపోయాడు. సుశీల మనస్సు చివుక్కుమంది. తనజీవితాన్ని, సంసారాన్ని నిలబెట్టే ఉత్తరాన్ని అంత నిర్లక్ష్యంగా విసిరిపోతాడా అనుకుంటూ — మహోదానందంతో ఆ కవర్ని తీసుకుని, విప్పి చదవ నారంభించింది.

ఉత్తరం చాలా క్లుప్తంగా ఉంది.

''—నీ ఉత్తరం చేరింది—ఏమని సమాధానం రాయాలో ఆలోచించుకోడానికి ఇంతకాలం పట్టింది. మాటిమాటికీ చెల్లెలు నగలు వాడుకున్నానని మీరు దెప్పుతున్నారు. నేను వాడుకోలేదు. వాడమని నేను అడుగలేదు. నేను ఆనాడు చదువు సాగక, ఇంటికి వచ్చేస్తే— నువ్వూ మావయ్యా ఆలోచించి, దాని నగలు పెట్టి నన్ను చదివించారు. ఆ సంగతికూడా నాకు తెలియదు. అందులో నా ప్రమేయంలేదు— నగలిమ్మని దాన్ని నేను అడుగలేదు. నా చేతిలో తను ఏ నగా పెట్టలేదు. పైగా నగలు వాడుకున్నదేగాక, ఆ సంగతి చెప్పి, ప్రాథేయపడడానికి బదులు— గిల్టు నగలుపెట్టి— కాపరానికి పంపిన ఆ మావయ్యని రాసిమ్మను— ఒక నెక్లెసు— గాజులు ఇంకా ఏవేవో అని రాశారు. ఆమాత్రం దానికి పండంటి కాపురం నాశనం అవ్వాలని పట్టుపట్టే మొగుడితో అదెంత కాలం కాపరం చెయ్యగలదు. కుట్టుపని నేర్చుకునో, ట్రయినింగు అయ్యో జీవితం వెళ్లమార్చుకుంటే చాలు— మీ ఉత్తరం వెనక— 'అతని' అన్నగారు నాకో ఉత్తరం రాశారు. ఎడ్రసు వాళ్లకెలా తెలుసో సరి— నగలు నేనువాడుకున్నట్టు రాసిస్తే చాలట— కేసు పెట్టరట! కేసు పెట్టనికాడికి, నేను వ్రాసివ్వడం ఎందుకో, రాసిచ్చినందువల్ల వాళ్లకి వచ్చే ఫలితం ఏమిటో నాకు అర్థంకాలేదు. చూసి, చూసి ఇలాటి పద్మవ్యూహాల్లో నేను జొరబడ దల్చుకోలేదు. పైగా ఈ మధ్యనే నేను వివాహం చేసుకున్నానుకూడా. ఖర్చులు కొంచెం అధికంగా ఉన్నాయి. మానసికంగా కొంచెం 'ఇది'గాకూడా ఉంది. ఇదే విషయంమీద అయిదే ఇకముందు నాకు ఏవిధమైన ఉత్తరం రాయనవసరంలేదు...........''

ఉత్తరం సాంతం చదివిన ఆమెకళ్లు అలవాటు చొప్పున బొటబొటాకన్నీటిబొట్లను రాల్చాయి. ★

ఏ పనీ నెరవేరదు. వ్యాపారంలో కొంత మంది వ్యక్తులు మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. కాబట్టి సాధ్యమైనంత వరకు అన్ని వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో ఆకస్మికంగా అనుకూల పరిణామాలు యేర్పడతాయి. వృత్తి ఉద్యోగాల్లో ప్రయాస పెరిగినా తగిన ప్రయోజనం ఉంటుంది. ఆరోగ్య విషయంలో జాగ్రత్త చాలా అవసరం. సాంఘిక వ్యవహారాల్లో పలుకుబడి పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయ తగదు. బంధుమిత్రుల సమావేశాల్లో పాల్గొంటారు. విలువైన వస్తువులు కొంటారు.

2, 3 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలు కొంతవరకు ప్రోత్సాహకరంగా ఉన్నా మీకు ఇంతవరకు సన్నిహితంగా ఉన్న వారితోనే భేదాభిప్రాయాలు రావడం వలన మనశ్శాంతి ఉండక పోవచ్చును. వ్యాపారంలో మీరు ఇదివరకు ప్రయత్నం చేసిన వ్యవహారాలు ఇప్పుడు నెరవేర వచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. కొంతమంది మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో మార్పులు రావు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమమీద విజయాన్ని సాధిస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. అధిక వ్యయం జరుగుతుంది.

31, 1 తేదీలు మంచివి. 2, 3 తేదీలు మంచివి కావు.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

ఈ వారం కూడా బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలు ప్రస్తుతం అనుకూలంగా ఉండడమే కాకుండా ముమ్ముందు రాణించుటకు అవసరమైన మార్పులు జరగగల సూచనలు ఉన్నాయి. ఇంత వరకు కొన్ని చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు కూడా ఈ వారం అందగలదు. వృత్తిలో మంచి అవకాశాలు లభించడం వలన ఆదాయం పెరుగుతుంది. అధికారుల వలన జరుగవలసిన పనులు సులభంగా నెరవేరతాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. కొంత మంది స్నేహితుల వ్యవహారాల్లో శ్రమ మీద విజయాన్ని సాధిస్తారు. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాహిత్య రంగంలో ఖ్యాతి లభిస్తుంది.

2, 3 తేదీలు మంచివి. 4, 5, 6 తేదీలు మంచివి కావు.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

గడచిన కొద్ది వారాల కంటే ఈ వారం అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు లభిస్తాయి. దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే వ్యవహారాల్లో కొంత మంది మిత్రుల తోడ్పాటు వలన అనుకూల సంఘటనలు జరుగుతాయి. ఆర్థికంగా బాగా ఉన్నా మీరు ఇది వరకు చేసిన వాగ్దానాల వల్ల అప్పుడప్పుడు కొంత ఇబ్బంది రావచ్చును. ఉద్యోగంలో మీ పట్ల ఇదివరకు అయిష్టంగా ఉండే అధికారులు కూడా అభిమానాన్ని చూపిస్తారు. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు— సాంఘిక వ్యవహారాల్లో ప్రాముఖ్యత లభిస్తుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

4, 5, 6 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ప్రతి క్షణం హోరా హోరీగా పోరాడితేనే గాని యే వ్యవహారమూ సాధించలేరు. వృత్తి వ్యాపారాల్లో స్వల్పంగా ఆదాయం పెరిగినా, ఎప్పుడూ ఆందోళన కలిగించే పరిస్థితి యేర్పడుతుంది. రాబోయే సహాయాన్ని నమ్మి యే వ్యవహారం ప్రారంభించటానికి సమయం కాదు. భాగస్వాములతో భేదాభిప్రాయాలు యేర్పడడం వలన కొన్ని వ్యవహారాలు నిలిచి పోవచ్చును. ఉద్యోగంలో మీకు అనుకూలంగా చిన్న చిన్న మార్పులు వస్తాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రాజకీయవ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి స్వల్ప అనారోగ్య సూచనలు ఉన్నాయి. బంధువుల్లో గౌరవం లభిస్తుంది.

31, 1 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

# జన్మదిన ఫలం

## జూలై-31

ప్రతి వ్యవహారంలోను ఏవో ఆటంకాలు రావడం వలన వృత్తి వ్యాపారాల్లో చెప్పతగిన అభివృద్ధిని సాధించలేరు కాని ఇప్పటికే ఉన్న పరిస్థితికి భంగం కలగదు. రావలసిన డబ్బు కూడా చేతికి వచ్చే వరకూ నమ్మడానికి వీలులేదు. వృత్తిలో స్వల్పంగా ఆదాయం పెరిగినా, మిగిలిన వ్యవహారాల్లో ఏర్పడిన తొట్రుపాటువల్ల మనస్సంతృప్తి కలగదు. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో చికాకులు రావచ్చును గాని అపకారం జరుగదు. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో పెద్ద మార్పులు రావు. శుభకార్యాల విషయంలో బంధువుల తోడ్పాటుమీద అనుకూలత లభించవచ్చును. సాంఘిక కార్యక్రమాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## ఆగస్టు 1

మీ ఆశలు ఫలించే సమయం. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి అన్నట్లుగా మీ భవిష్యదభివృద్ధికి అవసరమైన వ్యవహారాలు ప్రారంభించడానికి సమయం. వృత్తి వ్యాపారాల్లో కొన్ని ఇబ్బందులు వచ్చేటట్లు కన్పిస్తాయిగాని మీరు ధైర్యంగా వ్యవహరిస్తే అన్నీ సక్రమంగా జరిగిపోతాయి. కొన్ని వ్యవహారాల్లో మాత్రం దుర్వ్యయం జరగగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు మాత్రం అంత ప్రోత్సాహకరంగా ఉండవు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. వృత్తిరీత్యా దూర ప్రయాణాలు చేస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. కళాకారులకు, నౌకా వ్యాపారము చేయు వారికి మంచి సమయం.

## ఆగస్టు-2

జీవితంలో చాలా ముఖ్యమైన సంవత్సరాల్లో ఇది ఒకటి. వృత్తి వ్యాపారాల్లో అన్ని వ్యవహారాలూ మీరు మొదలు ఊహించిన దానికంటే బాగా ఉంటాయి. వ్యాపారంలో ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. భారీ యెత్తున చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీరు ఇంతవరకు రాదనుకొన్న డబ్బు కూడా చేతికి వస్తుంది. వృత్తిలో నూతన మార్గాలు లభించడంవలన ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో ఉన్నత స్థానం లభించవచ్చును. ఈ సంవత్సరంలో ఏర్పడే మైత్రివల్ల జీవితం ఊహించని మలుపు తిరుగుతుంది. అన్ని వ్యవహారాల్లోను ధైర్యంగా వ్యవహరించవలసిన సమయం. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. రాజకీయాల్లో ఉన్నత పదవి లభించవచ్చును. విద్యార్థులకు కొంచెం శ్రమమీద క్లాసు రాగల అవకాశం ఉంది.

## ఆగస్టు-3

గడచిన కొద్ది సంవత్సరాలకంటే ఈ సంవత్సరం చాలా బాగుంటుంది. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు చురుకుగా సాగి ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో కొంచెం పోటీ పెరిగినా మీ అభివృద్ధికి, కార్యక్రమాలకు ఆటంకం ఉండదు. ఉద్యోగంలో అధికారుల ఆదరణ లభిస్తుంది. మీరు కోరే మార్పులకోసం ప్రయత్నం చేయడానికి తగిన సమయం. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కొన్ని చిక్కులు రాగల సూచనలు ఉన్నాయి. సాంఘిక వ్యవహారాల్లో హోదా, పలుకుబడీ లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో ఏర్పడిన అనిశ్చిత పరిస్థితి తొలగిపోయినందు వలన మీకు ఆత్మవిశ్వాసం కలుగుతుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## ఆగస్టు-4

ఈ సంవత్సరం మీరు చేసే ప్రయత్నాలకు

## 31-7-1964 శుక్రవారము మొదలు
## 6-8-1964 గురువారము వరకు

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

గడచిన కొద్దివారాల కంటే ఈ వారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో వెంటనే ప్రయోజనం కలగక పోయినా, ముమ్ముందు లాభించుటకు తగిన అవకాశం లభిస్తుంది. మీ అభిప్రాయాలకు తగిన అవకాశం లభించడం వలన వ్యాపారంలో గౌరవం పెరుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు, సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి మామూలుగానే ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటి కంటే బాగా ఉంటాయి కాని వ్యయం పెరగవచ్చును.

31, 1 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

ఈ వారం అన్ని వ్యవహారాలూ అనుకూలంగా ఉన్నా రావలసిన డబ్బు సమయానికి అందనందు వలన అంత సంతృప్తికరంగా కనిపించక పోవచ్చును. వ్యాపారంలో సులభంగా జరగవలసిన పనులకు కూడా అప్పుడప్పుడు ఆటంకాలు రావడం వలన నిరుత్సాహం కలుగుతుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు ప్రాముఖ్యత రావడం వలన పశ్చాత్తాప పడతారు. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తి రీత్యా ప్రయాణం చేస్తారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులతో భేదాభిప్రాయాలు రావచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

2, 3 తేదీలు మంచివి. 31, 1 తేదీలు మంచివి కావు.

### మిధునం :

(మృగశిర 3, 4 పా ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఈ వారం చిత్రంగా ఉంటుంది. మీరు ప్రయత్నం చేసిన వ్యవహారాలకు ఆటంకాలు రావడం, సాధ్యం కావనుకొన్న వ్యవహారాలు ఆకస్మికంగా నెరవేరడం జరుగవచ్చును. వ్యాపారంలో కొన్ని వ్యవహారాల్లో యేర్పడిన అనిశ్చిత పరిస్థితి వలన మీరు పొందవలసిన లాభాన్ని కూడా పొందలేని పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో చేయవలసిన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. వృత్తి ఉద్యోగాల్లో శ్రమ పెరుగుతుంది కాని తగిన ప్రయోజనం ఉండదు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును. ఆరోగ్యం అంతబాగా ఉండదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉన్నా కొంచెం బలహీనత కన్పించవచ్చును. సంతోషకరమైన వార్తలను వింటారు.

31, 1 తేదీలు చాలా మంచివి. 2, 3 తేదీలు మంచివి కావు.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | చం | గు | కు శు రా |
| శ | వారఫలం | | ర |
| | మహేష్ | | బు |
| కే | | | |

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

వృత్తి వ్యాపారాల్లో వారారంభంలో కనిపించిన అనుకూలత వారాంతానికి ఉండక పోవచ్చును. వృత్తి వ్యాపారాల్లో అధిక వ్యయం జరగడం వలన ఆదాయం పెరిగినా సంతృప్తికరంగా ఉండదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో ఆదాయం యెలాగ ఉన్నా అందరివల్ల మంచి పేరు లభిస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో జోక్యం చేసికొనడం వలన వ్యయ ప్రయాసలు తప్ప ప్రయోజనం ఉండక పోవచ్చును.

స్త్రీలకు— వారాంతంలో ఆరోగ్యం అంత బాగా ఉండలేకపోవచ్చును. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

2, 3 తేదీలు మంచివి. 4, 5, 6 తేదీలు మంచివి కావు.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

అప్పుడప్పుడు కొన్ని వ్యవహారాల్లో అసంతృప్తికరమైన పరిస్థితి యేర్పడినా, మొత్తం మీద ఈ వారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించడం వలన ఆదాయం పెరగడానికి అవకాశం ఉంటుంది. ఇంతవరకు మీపట్ల ఉదాసీనంగా ఉన్నవారు కూడా, మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. ఈ వారం మీరు జరిపే వ్యవహారాల్లో కొంత డబ్బు చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో కొంత మంది వ్యక్తులు మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు గాని మీ సమయోచిత ప్రజ్ఞ వలన తప్పించుకొన గలరు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

4, 5, 6 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

**సూచన**

నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందక పోవడం వలన కొన్ని వ్యవహారాల్లో నష్టం వచ్చే సూచనలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో మీతో పోటీగా ఉన్న వారిదే పై చేయి కావడం వలన తాత్కాలికంగా మీరు వెనుకకు తగ్గ వలసిన పరిస్థితి యేర్పడ వచ్చును. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు బాగానే ఉంటాయి. ఉద్యోగంలో పై అధికారులతో భేదాభిప్రాయాలు రావచ్చును కాని దాని వల్ల మీకు నష్టం యేమీ కలగదు. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సత్పురుషుల సహవాసం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యంలో మార్పులు రావు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

31, 1 తేదీలు చెడ్డవి. మిగిలినవి మంచివి.

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పా.)

ఈ వారం విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి అవకాశం లేదు. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో యేర్పడిన చిక్కులను పరిష్కరించడంలో ఉండిపోవడం వలన వృత్తి వ్యాపారాల్లో ఈ వారం అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉండదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో యేర్పడిన అనిశ్చిత పరిస్థితి తొలగి పోయి పురోభివృద్ధికి మార్గం యేర్పడుతుంది. ఉద్యోగం సామాన్యంగా ఉంటుంది స్థిరాస్థి వ్యవహారాల్లో కొన్ని అనుకూలమైన మార్పులు రావచ్చును. ఆరోగ్యం వారం మధ్యలో అంతబాగా ఉండదు. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి.

స్త్రీలకు— స్వల్ప అనారోగ్యం చేయవచ్చును కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమ మీద నెరవేరతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

4, 5, 6 తేదీలు మంచివి. 2, 3 తేదీలు మంచివి కావు.

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ప్రతి వ్యవహారమూ యెంతో సులువుగా నెరవేరి పోతున్నట్లే కన్పిస్తుంది గాని మీరు యెన వ్యయ ప్రయాసలకు వోర్చి కృషి చేస్తే త

ఫలితం కొండను తవ్వి ఎలుకను పట్టినట్లుగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో నష్టం రాకపోయినా, ప్రయాసకు తగిన ప్రయోజనం లభించదు. సంవత్సరం మధ్యలో పెట్టుబడి చాలనందువలన లాభం వచ్చే వ్యాపారాలను కూడా విడిచిపెట్టవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. వృత్తి ఉద్యోగాల్లో పెద్ద మార్పులు రావు గాని అప్పుడప్పుడు ఆందోళన కలిగించే పరిస్థితి ఏర్పడవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యధాతథంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ స్థానాన్ని నిలబెట్టుకొంటారు. ఇంతవరకు మిమ్మల్ని వ్యతిరేకించిన బంధువులు కూడా మిమ్మల్ని గౌరవిస్తారు. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

## ఆగస్టు-5

అన్ని వ్యవహారాలూ అనుకూలంగా ఉన్నా ఏదో ఒక విధమైన ఆందోళనా, తొట్రుపాటూ కలగగల సూచనలు ఉన్నాయి. వ్యాపారం సామాన్యంగా ఉంటుంది. కొన్ని వ్యవహారాల్లో మీ యిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించవలసి వస్తుంది. వృత్తిలో ఆదాయం పెరగకపోయినా గౌరవం పెరుగుతుంది. ఉద్యోగస్థులకు స్థానచలనము కలగవచ్చును. కోర్టు వ్యవహారాల్లో ఆకస్మికంగా కొన్ని మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఇతరుల వాగ్దానాలను నమ్మి వృత్తి వ్యాపారాల్లో భారీ ప్రయత్నాలు చేయడం మంచిదికాదు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది. శుభకార్యాల విషయంలో ప్రోత్సాహం లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాల్లో కొన్ని మార్పులు రావచ్చును. వాటివల్ల ముమ్ముందు ప్రయోజనం ఉంటుంది. విద్యార్థులు శ్రమ మీద కృతార్థులు కావచ్చును.

## ఆగస్టు-6

వృత్తి వ్యాపారాల్లో అవస్థ మీది, అనుభవం మరొకరిది అయ్యే పరిస్థితి ఏర్పడవచ్చును. వృత్తి వ్యాపారాల్లో అనిశ్చిత పరిస్థితి ఏర్పడుతుంది. సులభంగా నెరవేరే పనులకు కూడా వ్యయ ప్రయాసలకు గురికావలసి వస్తుంది. భాగస్వాములతో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చినా అన్ని వ్యవహారాలు నిరాటంకంగా కొనసాగుతాయి. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో అననుకూల వాతావరణం ఏర్పడవచ్చును. కొంతమంది వ్యక్తులు పని గట్టుకొని, మీమీద దుష్ప్రచారం చేయడంవలన మానసికాందోళన కలుగుతుంది. ఆరోగ్యం బాగా ఉన్నా కాలడం, జారిపడడం వంటి ప్రమాదాలు కలగవచ్చును. కుటుంబ వ్యవహారాలు మామూలుగా జరిగిపోతాయి. రాజకీయాల్లో ప్రతిపక్షాల ఒత్తిడి తీవ్రంగా ఉంటుంది. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు అనుకూలంగా ఉంటాయి. ★












# మనసున మల్లెలు

27 వ పేజీ తరువాయి

క్కడ, వుంటున్నారో కనుక్కుని రమ్మన్నాడు. కారియర్లో భోజనం పెట్టించుకుని ఆ మనిషి బయల్దేరి వెళ్లాడు. ప్రసాద్, హోటల్ సర్వర్ని పిల్చి, "ఈవూరికి సర్కస్ వస్తోందా?" అని అడిగాడు.

"అవును సార్! మరొక వారం రోజుల్లో వస్తుంది. ప్రభాత సర్కస్."

"ఓహో అప్పుడే ఆ కంపెనీ మనుష్యులు ఈ వూరు వచ్చారేమిటి?"

"వచ్చారు సార్. ఒక మనిషి వచ్చి, వూరవతల వున్న పెద్ద ఇల్లొకటి అద్దెకు తీసుకున్నాడు. సర్కసు వస్తే, కొందరు ఆ ఇంట్లో వుంటారట. ఇంకా రెండు మూడు ఇళ్లు కావాలని తిరుగుతున్నాడు."

"ఓహో" అని మెల్లిగా భోజనం ముగించి బయటకు వచ్చాడు ప్రసాద్. నళినిని, ఆ హోటలు యజమానితో మాట్లాడి, అక్కడే ఒక మూల గదిలో వుండేటట్లు ఏర్పాటు చేశాడు. రామం కోసం ఎదురు చూడ సాగాడు.

ఒక గంట గడిచాక రామం తిరిగి వచ్చాడు. రామం సర్కసు వాళ్లు అద్దెకు తీసుకున్న మేడ చూసి వచ్చాడు. అది సుమారు రెండు మైళ్ల దూరంలో వుంది. సర్కసు నౌకరు తీసి కెళ్లిన కారియర్ భోంచేసి, ఆ సర్కసు మనిషి మేడ దిగి వచ్చాడట. కొద్ది సేపట్లో ఒక 'వాను' వచ్చి అతన్ని ఎక్కించు కుని వెళ్లి పోయిందట. నౌకర్నడిగితే, ఆ సర్కసు మనిషి మళ్లీ రాత్రి వస్తాడని, చెప్పాడట. మేడ మీద గది తాళం వేసుందట.

రాత్రి వరకూ అక్కడ వేచి వుండడం తప్ప చేయ గలిగిందేమీ లేదని గ్రహించారు వాళ్లు ముగ్గురు.

మధ్యాహ్నం ఒకసారి ప్రసాద్ వెళ్లి ఆ మేడను పరిశీలించాడు. చుట్టు ప్రక్కల మైలు దూరంలో ఇళ్లేమీ లేవు. అన్నీ పొలాలే. క్రింద నాలుగు గదులూ, పైన నాలుగు గదులూ వున్నాయి. అందులో ఒక గదికి తాళం వేసుంది. అందులోనే గంగరాజు సామాను పెట్టి వుంటాడని ప్రసాద్ వూహించాడు. ఆ తాళం బద్దలు గొట్టి లోపలి సామాన్లు చూద్దామని అనిపించినా, సామాను కన్నా, దొంగని పట్టుకోవడం కూడా ముఖ్యమను కున్నాడు. ఆ మేడకు కాపలా వుంటున్న నౌకరు బక్కగా, బలం లేని వాడిలా కన్పించాడు. పైగా వాడికి తన యజమాని దొంగ అని తెలిస్తే, అతన్ని పట్టివ్వడానికి వాడు కూడా ప్రయత్నించ వచ్చు. పోలీసు రిపోర్టు ఇచ్చి, పోలీసుల సహాయం కోరుదామా అని కొద్దిసేపు ఆలోచించి, దొంగ సొత్తు అక్కడ వుందో లేదో తెలియదు కాబట్టి వారిని తరువాత పిలువ వచ్చునని నిర్ణయించాడు.

సాయంకాలం ఏడు గంటల కల్లా, ప్రసాద్, రామం, నళినీ, ముగ్గురూ, బయల్దేరి ఆమేడ వద్దకు చేరుకున్నారు. గుమ్మంలో నౌకరు కూర్చుని వున్నాడు. మేడకు కొద్ది దూరంలో ఒక చెట్టు చాటున ముగ్గురూ నిల్చున్నారు. చుట్టూ చీకటి ఆవరించి వుంది. మేడ వద్ద మాత్రం లైటు వెలుగుతోంది. గంగరాజు రాక కోసం ఎదురు చూస్తూ కాలం గడప సాగారు. (సశేషం)

# అపహాయకుడి నిర్ణయం

22 వ పేజీ తరువాయి

"అది సమయాన్నిబట్టి ఉంటుంది......"

"అయితే...... ఏమా నాన్న....." ఏదో చెప్పబోయి ఆగిపోయాడు హాన్సెన్... ....చెప్పకూడనిదేదో తను చెప్పబోతున్నట్లు వాడి మనస్సు వాడ్ని హెచ్చరించింది, వేధించింది......ఏదో ఆలోచనల్లో పడిపోయాడు.........

"మీ నాన్న.....ఏం చేశాడు? ...... చెప్పు, హాన్సెన్!" అని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

లాగు జేబులో ఉంచుకున్న వాడిచేతికి కలం తగిలింది. దాన్ని తీసి బల్లమీదపెట్టి— "సార్! నాతో చదువుకునే చంద్రయ్య నా పుస్తకంమీది అట్ట చింపేశాడు. నాకు కోపమొచ్చి, వాడి కలాన్ని తీసి దాచిపెట్టేశాను. వాడి కలాన్ని నేను దొంగలించానని మానాన్న కొప్పడి, నన్ను బెత్తంతో బాగా కొట్టేశాడండి!......" అన్నాడు హాన్సెన్, పొంగుకువస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగటానికి ప్రయత్నిస్తూ.

"వాట్!" అని ఆశ్చర్యపోతూ లేచి నిలబడ్డాడు ఇన్‌స్పెక్టర్.

"నిజంగా నేను దొంగిలించలేదు, సార్! లాక్కున్నాను....అంతే..... ఆ తర్వాత, వాడికిచ్చేద్దామని వాళ్లింటికి వెళితే— వాడింట్లో లేడు, సార్! ఇలాంటి తప్పు నేనెప్పుడూ చేయను....చేయనంటే చేయను." అన్నాడు, వాడు........

"హాన్సెన్!" అంటూ వాడిదగ్గరికి వచ్చి, వాణ్ణి దగ్గరికి తీసుకున్నాడు.

"నువ్వు చేసిన చిన్న తప్పును తెల్సుకుని— ఇక్కడికి ఫిర్యాదుచేయడానికి వచ్చినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను........నువ్వెప్పుడూ ఇలాంటి తప్పులు చేయవనే నమ్మకమూ నాకుంది....గుడ్!." అని వాడి వీపుమీద గారాబంగా చేతితో కొట్టబోయాడు, ఇన్‌స్పెక్టర్.

అయితే— వాడి వీపుమీది వాతలను గుర్తించి ఆశ్చర్యపోయి, ఆవేశం పొందాడుకూడా!—

"మీనాన్న కొట్టాడా?" అని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

తలవూపాడు, హాన్సెన్.

"పసి హృదయాన్ని తెలుసుకోలేని కర్కోటకుడు!........ హాన్సెన్! ఇకనుంచి మీనాన్న నిన్ను కొడితే— నావద్ద చెప్పు! మీ నాన్నకు తగువైన పాఠం బోధిస్తాను.......ఊఁ ! కలం తీసికెళ్లి నీ స్నేహితుడికిచ్చేసి, క్షమాపణ చెప్పుకో!— వెళ్లు! ఇంటికి వెళ్లు!........" అని నచ్చచెప్పి, తనకై తెప్పించుకున్న రెండు అరటిపళ్లను అతనిచేతికిచ్చి పంపించాడు ఇన్‌స్పెక్టర్.

నమస్కారంచేసి బయటికి నడిచాడు హాన్సెన్.

వాడి మనస్సు ఇప్పుడు తేలికపడినట్లనిపించింది. కారణం?—

నాన్న చేస్తున్న దొంగ వ్యాపారాన్ని గురించి ఫిర్యాదు చేయబోయి, తన కుటుంబంలో రాగల అపకీర్తిని రాకుండా చేసుకున్నందుకు!

"అబ్బ! నాన్నగురించి— ఇకనుంచి ఎవరికీ ఏమీ చెప్పను!" అని నిశ్చయించుకుని, నిట్టూర్పు విడిచాడు.........

హాన్సెన్, తన ఇంటివేపు తేలికగా నడక సాగించాడు..........




## జ రి గి న క థ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాధను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికి కూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ల స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మామయ్యకు ఇష్టంలేకపోయినా, మధు స్కూల్లో చేరతాడు. హెడ్ మాస్టరు మధు ప్రతిభను చూసి సంతోషిస్తాడు. విశ్వనాథం మధును సతాయించటాన్ని సుందరమ్మగారు ప్రతిఘటిస్తుంది. అంతేకాదు, మధుపట్ల నానాటికి విశ్వనాధానికి ద్వేషం పెరిగిపోవటం, సుందరమ్మగారికి బాధాకరంగా పరిణమిస్తుంది. తోటలో జరిగిన దొంగతనాలకు మధు బాధ్యుడవుతాడు. ఈవిషయాన్ని తెలిసికొన్న విశ్వనాథం మధును రక్తం కారేటట్లు కొడతాడు. దగ్గరి బంధువైన డాక్టర్ కేశవరావ్ పరిచయం మధులో కొత్త ఉత్సాహాన్ని కల్పిస్తుంది. ఉద్యోగంలో చేరిన సూర్యానికి ఆ ఇంటినుంచి విడిపోవటం తప్పనిసరి అవుతుంది. అనతికాలానికే సూర్యం గృహస్థుడవుతాడు. ఇందిర అతనికి తగిన భార్య.

## 13

"ఇందులోతెలీటానికేముంది? చూడాలని ఉండి వెళ్లింది కాబోలు. నేను రాత్రేగా వస్తే? ఈ పూట మామయ్య దగ్గరికి వెళ్దామనుకొంటే దేవుడి దగ్గరికి తీసికొచ్చావ్".

"అదికాదు మధూ! మీ మామయ్య భార్యని కోపంతోనే పంపించేశారట."

"కోపంతోనా? అత్తయ్యమీదా?"

"ఏం? అంత విస్తుపోతున్నావ్? ఆయనకేవో వేరాయి ఆడవాళ్ల స్నేహాలున్నాయటగా?"

"ఛ! పూరుకో వదినా! నిజం తెలీకుండా మాట్లాడుతున్నావు." మధు కొంచెం తీవ్రంగా మందలించాడు.

"సరి! వూళ్లో అంతా అనుకొంటూంటే నేనేనా అబద్ధమాడింది.? నిన్న వచ్చినవాడివి నాతో వాదిస్తావేం?"

మధు ఇందిర చెప్పింది నమ్మలేకపోయాడు.

"అత్తయ్య ఇప్పుడు వూళ్లో లేదా ?"

"లేరట. మీ అన్నయ్యే చెప్పారు."

"ఛ! నేను నమ్మను. వాళ్లిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవాళ్లే !"

"సరేలే! నీకే తెలుస్తుంది."

"మామయ్య మారిపోయాడంటే దానికి తగిన కారణమేదో ఉండాలి."

ఇందిర తను విన్న విషయాలన్నీ చెప్తూ నడచింది.

"మామయ్య ఎందుకలా మారిపోయాడు? అత్తయ్య ఏమంత తప్పుచేసింది?" మధు లోలోపల మధనపడ్డాడు.— "వాళ్లిద్దరూ ఒకళ్లనొకళ్లు అర్థంచేసుకొని అన్యోన్యంగా ఉండేవాళ్లే వదినా! మరి ఎందుకలా జరిగిందో!"

"ఈనాడు ఈ మాట చెప్పుకుంటున్నట్టే ఆనాడు ఆ మాటా చెప్పుకున్నారుగా? డాక్టరుగారికి భార్యంటే పంచప్రాణాలనీ. ఆవిణ్ణి పట్టుమని పది రోజులైనా పుట్టింటికి పంపించరనీ— వాళ్లు సాక్షాత్తు పార్వతీపరమేశ్వరులంటే అబద్ధం కాదనీ.........ఒకళ్లు చెప్పటమేమిటి? నా కళ్లతో నేను ఎన్నిసార్లు చూడలేదు?— కాలమంతా ఒక్కలా ఉంటుందా? చీకటి కొన్నాళ్లు— వెన్నెల కొన్నాళ్లు"

ఆలోచిస్తూ నడుస్తుంటే మధు జ్ఞాపకాల్లో ఒకనాటి సంఘటన మెరుపులా మెరిసింది.

"ఒక విషయం చెప్పనా వదినా? అలాంటివి వాళ్ల సంసారంలో ఎన్ని ఉన్నాయో మనకు తెలీదు. ఏ ఒక్కటి ఉన్నా జీవితం ధన్యమైపోతుందనిపిస్తుంది.

నేను తరచుగా సాయంత్రాలు మామయ్య వాళ్లింటికి వెళ్తూండేవాడిని. ఆ రోజు చినుకులు పడుతున్నాయని ఇంట్లోనే కూర్చుని చదువుకోటానికుపక్రమించాను. చదువేమీ సాగలేదు. పుస్తకం మూసి మామయ్యగారింటికే బయల్దేరాను— వెళ్లేసరికి అత్తయ్య మామయ్య తాలింపు శెనగలు తింటున్నారు. నాకూ్కడా ఓ గాజు ప్లేటులో పెట్టారు. ముగ్గురం కబుర్లు చెప్పుకుంటూ, కూర్చున్నాం. అత్తయ్య లేచి పెరుపు మీదికి జల్లుకొడుతోందని కిటికీలు మూసి జడ విప్పుకుంటూ అద్దం ముందు నిలబడింది.— బయట చినుకుల ధాటి ఎక్కువైంది. హోరుమంటూ గాలికూడా ప్రారంభించింది.

అత్తయ్య తలదువ్వుకొని అందంగా సిగచుట్టుకొంది. బొట్టు పెట్టుకుంటూ అడిగింది—

"సిగ చక్కగా కుదిరింది కదూ?"

మాటలోపడి మేమిద్దరం అత్తయ్య అడిగింది విన్పించుకోలేదు.

"ఏమిటీ గర్వం? విన్పించుకోరేం?" అంది కోపంగా. అప్పటికి మామయ్య తలతిప్పి చూశాడు. అత్తయ్య విసురుగా వెనక్కితిరిగి పోయింది.

"నీ సిగ చాలా బావుంది రుక్మిణీ!"

అంతలోనే కోపం మర్చిపోయింది అత్తయ్య—

"నిజంగా?"

"అక్షరాలా! పూర్ణచంద్రుడికైనా వంక ఉంటుందిగానీ నీ సిగకి లేదు— గుండ్రంగా చంద్రబింబంలా— నల్లగా కారుమేఘంలా— కాదు— కాదు— తుమ్మెదల గుంపులా.........."

"నయం ఈగలదండులా అన్నారుకాదు. నిజం చెబుదురూ!"

"నిజం రుక్మిణీ! నాకు కవిత్వం రాదు ఖర్మ! కావాలంటే మధూనడుగు."

"నాకూ రాదు మామయ్యా!"

ముగ్గురం నవ్వుకున్నాం.

అత్మయ్య ముడి అందంగా చక్కగానే ఉంది. అద్దంలో పదేపదే చూసుకుంటూ యదాలాపంగా అంది.

"ఇప్పుడు మల్లెమొగ్గలు ఉంటే ఎంత బావుంటుంది. సిగ చక్కగా కుదిరింది."

మామయ్య నవ్వాడు. నాకేసి చూస్తూ అన్నాడు.

"మీ అత్తయ్యకి మల్లెలుమొగ్గలు కావాలింట ! ఎక్కడన్నా సంపాదించగలవేమిటి?"

"తోటలో పువ్వులు నేను వచ్చేముందే కోసి చిన్నత్తకిచ్చి వచ్చేశాను మామయ్యా! రేపైతే పూసినవన్నీ తెసా ను."

"మంచి సరసుడివే! మీ అత్తకి ఇప్పుడు



మనసౌతోంటే దేవు తెస్తావ్?" అన్నాడు మామయ్య.

"రుక్మిణీ! మొగ్గలే కావాలా? పువ్వులైనా ఫర్వాలేదా?" అడిగాడు హాస్యంగా.

"ఏవో ఒకటి తెప్పించుదురూ!" అంది అత్తయ్య.

"వాళ్ళ తోటలోవి మనకెందుకుగాని......బజార్లో దొరకవట్రా?" తిరిగి నాకేసి చూశాడు.

"ఉండటంలేదు మామయ్యా! స్కూలునుంచి వస్తోంటే బజార్లో ఎక్కడా కన్పించలేదు."

"ఎలా మరి?"

అత్తయ్య నవ్వుతూ దగ్గరికివచ్చింది—"బావుంది. నేనేదో సరదాగా అనుకుంటే ఇప్పుడే మిమ్మల్ని తెప్పించమన్నానా?"

"నీకు సరదాగా ఉంది కదూ? పోనీ చూద్దాం. టౌనులోనన్నా ఉండకపోతాయా? వెంకన్నని పిలు"

అత్తయ్యా నేనుకూడా ఆశ్చర్యపోయాం—

ఈ వర్షంలో—ఈదురు గాలిలో— టౌన్ ఏడెనిమిది మైళ్ళు—

"వెంకన్నని పిలవమంటే ఏవిటా ఆశ్చర్యం?"

"వాళ్ళెండి. ఏదో శాస్త్రం చెప్పినట్టు ఉంది. ఇప్పుడు పువ్వులు లేకపోతే కాదా? వర్షం కూడా ఎక్కువవుతోంది. పాపం వాడెలా వెళ్తాడు?"

"వాడు వెళ్ళలేనంటే నేనే వెళ్తాను. ముందు వాణ్ణి పిలు."

అత్తయ్య ఎంత బ్రతిమాలినా మామయ్య వినలేదు. చివరికి అంది.— "ఇప్పుడు పువ్వులు తెచ్చినా నేను పెట్టుకోను."

"అదీ చూద్దాం. కావాలనటం ఒద్దనటం నీ ఇష్టమే కాబోలు." నవ్వాడు మామయ్య. ఇక చెప్పేదేముంది?— ఐదు రూపాయల ఖర్చుతో వెంకన్న టౌను వెళ్లి పదిగంటల రాత్రికి మూట పొతికెడు మల్లె పువ్వులూ ఓ అరడజను ఎర్రగులాబీలూ తీసుకువచ్చాడు. మర్నాడు అత్తయ్య నడిగితే ఆ సంగతి చెప్పి నవ్వుతూ అంది— "మీ మామయ్య రసికత్వమంతా నువ్వూ నేర్చుకో."

అర్థంకాకపోయినా వూరుకున్నాను.

"కాని— అటువంటి మామయ్య అత్తయ్యని కోపంతో పంపించేశాడంటే— వాళ్లిద్దరూ వేరైపోయారంటే ఎలా నమ్మటం వదినా? అదే నిజమైతే ఏమిట కారణం?"

ఇందిర తల వంకిస్తూ అంది— "చిత్రంగానే ఉంది".

* * *

భోజనం కాగానే మధు హాస్పిటల్‌కి బయల్దేరాడు. ఇంటికి వెళ్లటానికి సిద్ధంగా ఉన్న కేశవరావు మధునిచూసి ఆగిపోయాడు— "ఎప్పుడ్రా రావటం? కులాసా?" ఎప్పట్లాగే పలకరించాడు నవ్వుతూ.

"రాత్రే వచ్చాను మామయ్యా! ఉదయం వద్దామనుకొంటే మా వదిన గుడికి తీసుకెళ్లమంది."

"కూర్చోముందు. ఏమిటి విశేషాలు?" తను ఓ కూర్చీలో కూర్చుంటూ మధుకి కుర్చీ చూపించాడు.

"అబ్బే! ఏమున్నాయ్?" ఎందుకో మునుపటిలా మాట్లాడలేకపోతున్నాడు మధు.

"ఊఁ ఎలా రాశావు పరీక్షలు?"

"ఫర్వాలేదు."

సంభాషణలో ఎప్పుడూ ఎరగని వెలితి ఏదో అనుభవమవుతోంది ఇద్దరికీ. కొంత సేపటికి కేశవరావు అన్నాడు.

"అయితే నీకు కొత్త విషయమేమీ తెలీలేదా?"

"కొత్తదా? ఏమిటది?"

"ఎందుకురా? దాస్తావ్. నా గురించి ఏమీ వినలేదూ?"

"అదా? దానికేంలే? పుకార్లు పుడుతూనే ఉంటాయి."

"పుకారు కాదురా. నిజమే."

మధు మాట్లాడలేదు.

"మీ అత్తయ్య పుట్టింటికి వెళ్లిపోయింది."

మధు వెంటనే అడిగాడు— "నువ్వే వెళ్లిపొమ్మన్నావా?"

"ఏదైనా ఒకటే— సామరస్యంలేక పోయాక." మధు కేశవరావు మొహంలోకి చూడలేక కాంపౌండ్ గేటుమీదికి దృష్టి సారించాడు.

కేశవరావు నెమ్మదిగా అన్నాడు— "రుక్మిణి వెళ్లిపోతోంటే చూస్తూ వూరుకోవటం తప్పని సరైంది మధూ!"

"ఇంటికి వెళ్దాంలే మామయ్యా! నువ్వు భోజనంకూడా చెయ్యలేదు కాబోలు— తర్వాత మాట్లాడుకోవచ్చు." మధులేచి నిలబడ్డాడు. కేశవరావు మౌనంగా లేచాడు.

అత్తయ్యలేని ఇల్లు బోసిగా కాంతి విహీనంగా ఉన్నట్టు తోచింది మధుకి. ఇంట్లో సామానంతా చిందరవందరగా ఉంది. పడగ్గది ఏదో సామాను కొట్టులా తయారైంది. పరుపుమీద దుప్పటి మాసిపోయి అద్దంనిండా మరకలు పడి గోడలన్నీ దుమ్ము కొట్టుకుని—...ఛ! ఏం చేస్తున్నారీ పని మనుషులు? చెప్పి చేయించుకోవటమైనా తెలీలేదా మామయ్యకి?

కేశవరావు భోంచేస్తూంటే పక్కనే కూర్చున్నాడు మధు. వంటిల్లు మరీ జిడ్డు కట్టుకుపోయింది. మవునంగా పరికించటం తప్ప ఏమీ మాట్లాడలేదు మధు— భోజనం కానిచ్చి గదిలోకి వచ్చి అలమారులోంచి వెండి డబ్బా తీస్తే వక్కపొడి కాస్తా ఖిందుకుంది.

"అరె! వక్కపొడి తెప్పించాలని ఏ రోజుకారోజు మర్చిపోతున్నాను."

"పోనీ వెంకన్నని పిల్చి ఇప్పుడే తెప్పించరాదూ?"

"వాడెక్కడికోపోయాడు. ఆ పని వేళవరకూ ఎక్కడో తిరుగుతూంటాడు. సాయంత్రం చూద్దాంలే."

మధు మవునంగా టేబుల్‌మీది పుస్తకాలు తిరగేస్తూ కూర్చున్నాడు.

"ఏం మధూ అంత మవునంగా ఉన్నావ్?"

"అబ్బే! ఏంలేదు మామయ్యా!"

"నామీద నీకు కోపంగా ఉంది కదూ?"

మధు కొంచెం నవ్వాడు— "ఎందుకు?"

"ఎందుకేమిటి? అందరూ ఎందుకు తప్పు పడుతున్నారో నువ్వూ అందుకే."

మధు పుస్తకాలు మూసేసి కేశవరావు మొహంలోకి చూస్తూ అన్నాడు.— "కాని.......ఎందుకలా చేశావు మామయ్యా"

కేశవరావు కొంతసేపు మవునంగా ఉండిపోయాడు.

"నేను రుక్మిణిని ఎంత ప్రాణంగా చూసుకున్నానో చిన్నవాడివైన నువ్వూ గ్రహించే ఉంటావు మధూ! అయినా తను నన్ను సరిగా అర్థంచేసుకోలేకపోయింది."

ఒక్క క్షణం ఆగి మళ్లీ అన్నాడు— "అర్థం చేసుకోకపోతే పోనీ! అపార్థం చేసుకుని వేధించటం మొదలుపెడితే ఏంచెయ్యగలను చెప్పు?"

కేశవరావు మధు మొహంలోకి చూశాడు. మధుకి సంగతేమిటో అర్థమవుతూన్నట్టు లేదు. అయోమయంగా చూస్తూ కూర్చున్నాడు.

"చిన్నవాడివైనా మా దాంపత్య రహస్యాలు నీకు చెప్తున్నాను మధూ! ఎప్పటికప్పుడు నీకు ఉత్తరం రాయాలని మనసు ఆరాటపెడుతున్నా సాహసించి రాయలేకపోయాను. అందరిలా నువ్వునన్నేం అసహ్యించుకుంటావోనని మథనపడుతూనే ఉన్నాను."

# కూలిన గోడలు

"అసలు నేను మొదట ఈ విషయం నమ్మలేదు మామయ్యా! కాని............"

"నేను డాక్టర్ని. వృత్తిధర్మాన నాకు ఆడవాళ్లు— మొగవాళ్లు— పడుచువాళ్లు— ముసలివాళ్లు— అనే భేదాభిప్రాయాలేమీ ఉండకూడదుకదా? ఎవరితో మాట్లాడటానికైనా నాకు ఆటంకాలు ఉండవు."

"అయితే?" అన్నట్టు చూశాడు మధు.

"రుక్మిణికి నేనంటే భర్తగా పూజ్యభావమేగాక ప్రియుడిగా అంతులేని అనురాగం. దానికి నేను పరవశత్వంలో మైమరచిపోయిన క్షణాలు ఉన్నాయి. కాని.......... ఏ అనురాగమైనా మోజుగా మారి మనిషిని మూర్ఖురాల్నిచేస్తే భరించటం ఎలా?"

"........................."

"నేను నిష్కల్మషంగా ప్రవర్తించటం లేదనీ— నా స్నేహం లేవో రహస్యంగా సాగించుకొంటున్నాననీ— రుక్మిణి అనుమానం."

మధుకి ఆశ్చర్యం కలిగింది— "నీ మీద అత్తయ్యకి అనుమానమా? ఎన్నాళ్లనుంచి."

---

"ఈ చిన్న తగాదా కోర్టుబైట పరిష్కారం చేసుకోలేరుటయ్యా?" అన్నాడు న్యాయాధికారి ముద్దాయితో.

'అదేబాబు! మేమిద్దరము పరిష్కారం చేసుకుంటూన్నప్పుడే పోలీసులు పట్టుకున్నారు' అన్నాడు ముద్దాయి.

ఆర్. సన్యాసిరావు (విశాఖ)

---

"ఖచ్చితంగా చెప్పాలంటే పెళ్లయిన కొత్తనుంచీనూ— నేను ఎన్నో విధాల చెప్పాను. ప్రమాణాలు చేశాను. ఫలితం కనిపించలేదు. అప్పటికప్పుడు సరిపెట్టుకున్నా తన అనుమానాలు పూర్తిగా వదులుకునేది కాదు. హాస్యానికైనా వెళ్లగక్కుతూ ఉండేది— ఆ మధ్య మరీ మూర్ఖంగా వేధించింది. చీకటిపడితే బయట ఉండకూడదు. పనిమనిషితోనైనా నవ్వుతూ మాట్లాడకూడదు. ఆడవాళ్ల విషయమై నేను ఎక్కువగా పుస్తకాలవీ తెచ్చి బొమ్మలవీ చూసి సరదా పడకూడదు.— శంకించే మనసుకి ఎన్ని ఆధారాలైనా దొరుకుతాయి—రుక్మిణిని బాధపెట్టటం నాకూ ఇష్టంలేదు. తను సంతోషంగా నవ్వుతూ తిరిగితేనే నాకూ సంతోషం— నాశక్తి ఉన్నంతవరకు ఆచరించగలను. హద్దులు మీరితే ఏంచెయ్యను? రుక్మిణి అనుమానాలకూ నా ఉద్యోగ ధర్మాలకు ఎక్కడా పొత్తు కుదరలేదు. క్రమంగా తనే తెలుసుకొంటుందని కొంతకాలం వూరుకున్నాను."

"......................"

"ఈ విషయాలలో ఇద్దరం అప్పుడప్పుడూ ఘర్షణ పడుతూనే ఉన్నాం— అయినా ఎప్పుడూ అంతవరకూ రాలేదు— ఒకరోజు మధ్యాన్నం నేను గదిలో పడుకుని ఉన్నాను. ఆ రోజు హాస్పిటల్‌కెళ్లలేదు— నిద్రపోకుండా ఏవో కొత్త పత్రికలు చూస్తున్నాను.

"డాక్టరుగారు ఉన్నారాండీ?" అని ఎవరో స్త్రీ అడగటం—

"నిద్రపోతున్నారు. ఇప్పుడు లేవరు." అని రుక్మిణి చెప్పటం వినిపించాయి. నేను చటుక్కున లేచి వెళ్దామనుకున్నాను. రుక్మిణి ఏంచేస్తుందో చూడాలని ఆగిపోయాను.

"రాత్రంతా నిద్రలేదు తల్లీ! ఈ పాడు దగ్గు పడుకోనివ్వలేదు. ఆస్పత్రికెళ్తే డాక్టరుగారు రాలేదన్నారు. ఆ బాబుని అడిగి ఒక్క బిళ్లయినా మింగకపోతే రాత్రికి ఆయాసంతో చచ్చిపోతానమ్మా!"

"అయితే ఏం చెయ్యమంటావ్? లేపమంటావా?" కటువుగా అంది రుక్మిణి.

"ఎంతమాట తల్లీ! ఇక్కడే కూర్చుంటాను. ఆ బాబుని నిద్రపోనివ్వండి."

"బాగానే ఉంది. రేపు హాస్పిటల్‌కి వెళ్లరాదూ?" నాకు కోపం ముంచుకు వచ్చింది. విసురుగా పుస్తకం టేబుల్‌మీదికి విసిరి చప్పుడుచేశాను.

రుక్మిణి నెమ్మదిగా గదిలోకి వచ్చింది. ఏమీ చెప్పలేదు. దగ్గరికి వచ్చి కూర్చుంటూ అంది— "చదువు అయిందేమిటి? గిరవాటేస్తున్నారు."

"బద్ధకంగా ఉంది. పడుకోవాలి."

రుక్మిణి మవునంగా దోమతెర దించుతోంది.

"నా కోసం ఎవరైనా వస్తే లేపు. ఫర్వాలేదు."

"అంత ప్రాణాల మీదికేం వచ్చిపడింది? వెనక్కి పోతారు మళ్లావస్తారు."

"పాపం ఏదో ఆశపెట్టుకు వస్తారు. పొమ్మనటం ఏమిటి?"

"అలాగే. పడుకోండి— అదేం? లేస్తున్నారు."

"బాత్‌రూం కెళ్లాలి." నేను గది వెనక తలుపు తీసుకుని దొడ్లోకి వెళ్లాను. వచ్చేసరికి చెప్పింది—

"మీ కోసం ఎవతో వచ్చింది."

"ఎప్పుడు?"

"ఇప్పుడే. మీరలా దొడ్లోకి వెళ్లాక."

"అది సరేగాని—ఏమిటంత అసభ్యంగా మాట్లాడుతున్నావ్?"

"మరేం ఫర్వాలేదు— సభ్యంగా ఉన్న వాళ్లనంటే కదా తప్పు."

అప్పటికి వాదించ దల్చుకోలేదు. టవల్ బుజాల మీదుగా కప్పుకుని హాల్లోకి వెళ్లాను— బల్లమీద కూర్చున్న ఆ మనిషి అనుకోకుండా నాదాక చూసి తడబడుతూ లేచి చేతులు జోడించింది.

"నమస్కారం బాబూ!"

"నమస్కారం తల్లీ! కూర్చోండి. మీరు వచ్చి చాలా సేపైంది కదమ్మా?"

"లేదు బాబూ ఇప్పుడే. తమరు నిద్రపోతున్నారని అమ్మగారు చెప్పారు."

"ఆ అమ్మగారే నన్ను లేపితే వచ్చాను."

రుక్మిణి గదిలోకి వెళ్లే గుమ్మంలోని నిలబడి ఉంది.

"నేను కూర్చుని ఉందునుకదా తల్లీ! బాబుగార్ని ఎందుకు లేపారమ్మా!" అంటూ నొచ్చుకుందావిడ. సన్నగా— పొట్టిగా— బక్కపలచగా— పాలిపోయిన శరీరంతో నీరసంగా— నలభై సంవత్సరాల వయస్సు

ండీ తనివితీరా చూస్తోంది— నా కెరటాక్ బాధ వేసింది. రుక్మిణికి ఏదో కృతజ్ఞత చూపించాలని ఆవిడ తాపత్రయపడిపోతోంది— తను గురించి రుక్మిణి ఎంత చెడ్డగా వూహిస్తోందో తెలిస్తే ఏమైపోతుందో మరి!

ఆవిడ జబ్బు వివరాలన్నీ అడిగి చీటీరాసి ఇచ్చాను. కాంపౌండర్‌కి చూపించి హాస్పిటల్‌లో మందు తీసికోమని చెప్పాను.—ఆవిడ మా ఇద్దరికీ దణ్ణాలు పెట్టి వెళ్ళిపోయింది.—నేను లేచి గదిలోకి నడిచాను. రుక్మిణీ మౌనంగా నిలబడింది తలుపు దగ్గరే.

"రుక్మిణీ?"

తలతిప్పి చూసింది.

"నువ్వు ఒక డాక్టర్ భార్యవి! ఇంటికి వచ్చిన వాళ్ళని మర్యాదచెయ్యాల్సిన బాధ్యత నీది."

"ఇప్పుడు నేనేం చేశాను."

"ఏం చేశావో తెలుసు. ఎందుకు చేశావోకూడా తెలుసు— ఇకనుండెప్పుడూ నా మర్యాద మంట గలపద్దని మరోసారి చెప్తున్నాను."

"........................"

"నీ అనుమానాలు ఎలా పోతాయో అర్థం కావటంలేదు. ఉద్యోగానికి రిజైనిమ్మంటావా? అడుక్కుతిందామా?"

# కూలిన గోడలు

"ఏమిటా మాటలు?"

"లేకపోతే ఏమిటి? జీవితం పొడుగునా మనసుల్లో బరువులు పెట్టుకు కుళ్ళిపోయి చివరి దశలో విచారిద్దాం. కాని— అప్పటికేమీ మిగలదు. బూడిదే! తెలుస్తోందా?"

"బాగా తెలుస్తోంది. ఇక నన్ను మభ్యపెట్ట లేరుగాని వూరుకోండి."

ఆ తర్వాత మా ఇద్దరికీ పెద్ద ఘర్షణ జరిగింది. చివరికి అన్నాను— "ఈ అనుమానాలతో నువ్వు నా దగ్గిర ఉండలేవు. ఇద్దరికీ శాంతి ఉండదు. వెళ్ళిపో."

"చాలా సంతోషం. ఇక్కడే నిక్కచ్చపు బతుకు బతికేకన్నా మరెక్కడికైనాపోయి ఉండవచ్చు."— అంతే తన పంతం మార్చుకోలేదు — నేనూ వారించ లేదు. ప్రయాణమై పుట్టింటికి వెళ్ళిపోయింది— నేను తనని బతిమాలాడుతానని — తను లేకుండా నేను ఉండనని అభిప్రాయపడి అంతదూరం వెళ్ళ నిచ్చింది— ఇప్పటికి మామధ్య ఒక్క ఉత్తరంకూడా నడవలేదు." కేశవరావు మధు కళ్ళలోకి చూస్తూ అడిగాడు— "చెప్పు మధూ! నేను తప్పుచేశానా?"

ధ్యానంగా వింటున్న మధు తేరుకుని కొంచెం నవ్వాడు— "నీకు చెప్పేంతటి వాడినా మామయ్యా!"

"అలాక్కాదు. నీకేం తోచిందో చెప్పు."

"నీ తప్పేంలేదు మామయ్యా! అత్తయ్యే కొంచెం తెలివి తక్కువగా ప్రవర్తించింది. దానికీ కారణం లేకుండా ఉండదు".

"సమర్థిస్తున్నావా నువ్వు?"

"ఎందుకు సమర్థించను? తప్పుచేసిన వాళ్ళని ఎంతకాలం అసహ్యహించుకుంటాం? అత్తయ్యని నువ్వు అమితంగా అభిమానించావు. అపారంగా ప్రేమిచావు. నీ మనసుల్లో మహోన్నతమైన స్థానం ఇచ్చావు — అంతటితో నీ బాధ్యత తీరిపోయిందా? అత్తయ్య తనకు లభించిన స్థానం శాశ్వతం చేసుకోవాలనీ, నీ అనురాగంనుంచి ఏనాటికీ తను దూరం కాకూడదనీ తాపత్రయపడింది. అందుకే అమాయకంగా ప్రవర్తించి దొరికిపోయింది. ఆ అమాయకత్వాన్ని నువ్వే భరించలేకపోతే ఎలా మామయ్యా?"

"అది వేరే సంగతి మధూ! నా సహనానికైనా అవధులు ఉన్నాయి కదా? — తనకి అంత స్వార్థం పనికిరాదు."

"స్వార్థం లేకపోతే జీవితమే లేదు మామయ్యా! అంతా త్యాగమే ఉండి స్వార్థం లేనినాడు మనిషి కష్టాల పాలైపోతాడు."

"నువ్వు పక్షపాతంగా మాట్లాడుతున్నావు మధూ. రుక్మిణిని ఇంతగా సమర్థించటంలో అర్థమేం లేదు."

"సరే! నీ నిజాయితీ ఏమిటి? నీ కేవో స్నేహాలు ఉన్నాయంటున్నారు. అదికాదా నిజమేనా?"

"ఎందుకు కాకూడదు? అన్నీ నిజమే."

"మామయ్యా!" మధు దెబ్బ తిన్నట్టు చూశాడు.

"నిజం మధూ! నేను తప్పు చేస్తున్నానని తెలిసే చేస్తున్నాను."

మధు శిలాప్రతిమలా మాట్లాడలేకపోయాడు.

"రుక్మిణి ఉన్నంతకాలం నేను నిప్పులా ఉన్నాను. నా నీతి నిజాయితీలు నా భార్యే నమ్మలేక పోయింది. నా మీదకు ఎలాగూ నింద వచ్చింది ఇక నా నీతికి అర్థమేమిటి? నన్ను చూసి ఎవర సంతోషించాలి? నా వ్యక్తిత్వాన్ని ఎవరు గౌరవించాలి? ఏదీలేదు. ఏనాడు రుక్మిణి గడపదాటి బయట కెళ్ళిందో ఆనాడే నేనూ లేను. నామంచి చెడ్డలు లేవు. కేశవరావు దీర్ఘంగా నిట్టూర్చాడు.

మధు తమాయించుకోవటానికే కొంతసే పట్టింది.— బాధగా అన్నాడు— "నువ్వు చేస్తున్న వాకేమీ......నచ్చలేదు మామయ్యా!"

"నీకు కష్టంగా ఉందికదూ మధూ?"

"కష్టంగానే ఉంది. కొంచెం తీవ్రం అన్నాడు మధు— "ఉన్నమాట అనక తప్పదు. నువ్వు మగవాడివి. మగవాడిలాగే ప్రవర్తించావు- నీమీద ఒక అపనింద పడినప్పుడు నీ కర్తవ్య ఏమిటి? అది అబద్ధమని నిరూపించి నీ నిజాయి రుజువు చేసుకుంటావా? — మనసు విరచుకు నీతినియమాలు విసర్జించి ప్రతీకారం తీర కుంటావా? ఒక్కటి ఆలోచించు మామయ్యా అత్తయ్యనే నువ్వు అవమానిస్తావ్—అత్తయ నీలాగే చేసేదా? నువ్వు ఎలాగూ అననే అన్నావుగ అని తన మాన మర్యాదలు పోగొట్టుకుని అసభ్యం ప్రవర్తించేదా? ఆలోచించు మామయ్యా"

"మధూ! నేనే పొరపడ్డానంటున్నావా?"



"అత్తయ్య చాల మూర్ఖంగా ప్రవర్తించింది. అయితే నీ వివేకమేది? సంసారంలో ఒడుదుడుకులు సంభవిస్తే వాటిని సర్దుకోవలసిన బాధ్యత నీమీద మాత్రం లేదనుకున్నావా? అత్తయ్యని మనిషిని చెయ్యటానికి నువ్వుకాకపోతే ఎవరు ప్రయత్నిస్తారు?

"మామయ్యా! మీ దాంపత్యంలో పరిపూర్ణత వెల్లివిరిసింది — పవిత్రతే నశించిపోయింది." మధు మథనపడిపోయాడు. కేశవరావు మాట్లాడ లేదు.

చేదు చరిత్ర విన్నట్లు మధు మనస్సు కలత బారిపోయింది— జీవితంలో ప్రతీ ఒక్కరికీ ఒక్కో సమస్య! దాని పరిష్కారంతప్ప అన్నీ తెలుస్తాయి. స్త్రీ జీవితంలో ఉన్నతమైనది మాతృస్థానం ఒక్కటే! బిడ్డలు నిరసించినా మాతృస్థానం మారదు. కాని భర్త నిరసించినప్పుడు భార్య స్థానానికి విలువే లేదు. కొడుక్కి తల్లి ఒక్కతే! కాని భర్తకు— భార్యలు చాలామంది. క్షణ క్షణానికి ఊగిసలాడే భార్య స్థానాన్ని నిలుపుకోవటానికి స్త్రీకి వివేకం కావాలి. అదే రుక్మిణిలో లోపించింది—భర్త పక్క మంగా ఉన్ననాడు అర్థం చేసుకోలేకపోయింది. విసర్జించిపోయిననాడు అతను అక్రమాలకు తల పడ్డాడు.— పిచ్చి రుక్మిణి ఏం సాధించగలిగింది?

మధు హఠాత్తుగా అడిగాడు— "మురళి ఎక్కడున్నాడు?"

"చదువుకొంటున్నాడు. కాన్వెంటులోనే."

"సరళ".

"వాళ్లమ్మ దగ్గిర."

"మామయ్యా! నా అనుభవంతో చెప్తున్నాను. బిడ్డలకు తల్లిదండ్రులలోటుకన్నా నికృష్టమైంది మరొకటిలేదు— వాళ్ల భవిష్యత్తయినా మీరు ఆలోచించకపోవటం మూర్ఖత్వం—" మధుకి కోపం వచ్చింది. లేచి నిలబడ్డాడు. కేశవరావు ఏదో అనబోయే సరికి రామ్మూర్తి గేటు తీసుకుని దగ్గుకొంటూ వచ్చాడు.— "రాత్రి దగ్గు మరీ ఎక్కువైంది డాక్టారుగారూ! పడుకోనివ్వకుండా నిలేసిందండి!" అన్నాడు దగ్గుతూనే— "'పొద్దున్న వచ్చి తమ దర్శనం చేసుకుందామంటే మాయదారి చుట్టాలు నా ప్రాణాలమీదికొచ్చి పడ్డారు. వాళ్లందర్నీ పేరుపేరునా పలకరించి మర్యాదలు చేసేసరికి ఈవేళయింది. ఆస్పత్రికి పరిగెత్తుకు పోతే తమరు లేరు."—అంటూ సోది చెప్పుకొచ్చాడు.

కేశవరావు వివరాలన్నీ తెలుసుకుని చీటీ రాసిచ్చాడు.— అది అందుకుని వెళ్తూ రామ్మూర్తి మధుకేసి చూసి ఇకిలించాడు— "పెద్దవాడివై పోయావయ్యా! బాగా చదువుతున్నావా?"

"ఏదోలెండి".

"ఏదో అంటే ఎలాగ? మీ ఆవిడ డాక్టరమ్మ చదువుతుందట. నువ్వుకూడా అంతకుమించి చదువుకోవద్దా?"

మధుకి ఒళ్లు మండింది.— "రామ్మూర్తిగారూ ఇది మీ ఇల్లుగాదు. మా ఇల్లూగాదు. డాక్టరు గారిల్లు. తర్వాత మాట్లాడుకుందాం. వెళ్లి రండి." రామ్మూర్తి మాడ్చుకున్న మొహంతో వెళ్లిపోయాడు.

"ఈయనే కదూ వదినగారిమీద కేసు పెట్టాడు. ఏమైంది?"

"అందుకే కొత్తగా దగ్గు పట్టుకుంది. విశ్వనాథం మాటలు విని సర్వనాశనమైపోయానని ఇప్పుడేడుస్తున్నాడు."

"మామయ్య అప్పు?"

"నెత్తిమీద చేతులు"

"వస్తా మామయ్యా! సాయంత్రం మళ్ళా వస్తా."

మధు లేచాడు— "మా అమ్మమ్మని చూడనేలేదు. మా చిన్నత్తకి మళ్ళా మొగపిల్లవాడటగా? అక్కడే ఉంది. వస్తుందేమో! వెళ్తా మామయ్యా!"

(సశేషం)



# నాలిక తెగిన పిచ్చుక

ఒక ఊళ్లో ఒక ముసలావిడుండేది. ఆవిడకి చాలా కోపం. ఒకరోజు బట్టలకి గంజి పెడదామని ఒక మూకుడులో పిండిపోసి ఉంచింది. కాని, వాళ్ళ పక్క-ఇంటి ముసలావిడ పెంచే పిచ్చుక ఆ పిండి కాస్తా తినేసింది. పిండిపోసిన ముసలావిడకి వెర్రి కోపం వచ్చేసింది.

"ఛీ, పాడు పిట్టా!" అని దాన్ని పట్టుకుని నాలిక కాస్తా కోసేసింది.

పిచ్చుక పెంచే ముసలావిడ ఇదివిని చాలా బాధపడింది. నాలిక తెగిన పిట్ట ఎక్కడికో పారిపోయిందని తెలుసుకుని దానికోసం వెతకటం మొదలు పెట్టారు.

కనిపించిన ప్రతివారినీ, "మా పిట్ట ఏదీ? నాలిక తెగిన మా పిచ్చుక ఎక్కడుందో తెలుసా?" అని అడిగారు. పిట్టనే పిలిచి చూశారు, "ఓ పిచ్చుకా!" అని.

ఎలాగయితేనేం, పిచ్చుక ఉండే చోటు కనుక్కున్నారు. ఆ పిచ్చుక తన భార్య బిడ్డలేకాక, మనుములూ మనుమరాళ్లతో కూడా కలిసి ఉంటోంది. పాతయజమాని, యజమానురాలు తనకోసం ఇలా వెతుక్కుంటూ వచ్చారని తెలిసి, చాలా సంతోషించింది. వాళ్లని మర్యాదగా లోపలికి తీసికెళ్లి భోజనం ఏర్పాటు చేసింది. వాళ్లు భోజనం చేస్తూఉంటే వాళ్ల వినోదం కోసం తక్కిన పిచ్చుకల చేత చిన్న నాట్యం చేయించింది!

ముసలి దంపతులిద్దరూ ఇంటికి తిరిగి వెళ్లే సమయం వచ్చింది. పిచ్చుక రెండు బుట్టలు చూపించి

"ఇందులో ఒకటి బరువుది, రెండోది తేలికది! ఏది కావాలి మీకు?" అనడిగింది.

"మేమా పెద్ద వాళ్లం! మాకు ఓపిక లేదు! తేలికదే ఇవ్వు!" అన్నారు వాళ్లు. సరే, తేలికబుట్టతో ఇంటికి తిరిగి వచ్చారు. దాన్ని తెరిచి చూశారు. బుట్టనిండా నగలూ, నాణ్యాలూ, చీనాంబరాలూను! అంతేకాదు, వాటిని బయటికి తీసినకొద్దీ ఇంకా వస్తూనే ఉన్నాయి! వాళ్లు మంచి ఐశ్వర్యవంతులయి పోయారు!

పక్కింటి ముసలామె – పిచ్చుక నాలిక కోసినావిడ–ఇదంతా విని అసూయపడిపోయింది. చల్లగా వెళ్ళి, పిచ్చుక ఇల్లెక్కడో కనుక్కుంది. "నేనూ, వెళ్ళి తెచ్చుకుంటా బుట్టని," అనుకుంది. పిచ్చుక ఇంటికి వెళ్ళనూ వెళ్ళింది. పిచ్చుకి పాపం, పాతసంగతులేవీ మనసులో ఉంచుకోకుండా ముసిలావిడకి విందు చేసింది. విందు పూర్తయినతర్వాత రెండు బుట్టలు చూపించి, "ఒకటి బరువుదీ, రెండోది తేలికదీ! ఏది కావాలి?" అనడిగింది.

ముసిలామె దురాశతో బరువుదే కావాలని కోరుకుంది.

పిచ్చుకలు నవ్వుకుంటూ బుట్టని ముసిలావిడ వీపుమీదకి ఎక్కించాయి. తోప్పుకుంటూ ఇంటికి చేరుకుంది ఆమె. దించిన వెంటనే ఆత్రంతో మూత తెరిచి చూసింది. ఏముంది! ఎన్నో భూతాలు బుట్టలోంచి బయటికివచ్చి ఆమని చీల్చి చెండాడేశాయి.



# స్వామీ వివేకానందుని కంచుబొమ్మ!



"భూతకాల ప్రాతిపదిక గల భారత ప్రతిష్ఠపట్ల ప్రగాఢ గర్వమున్న వాడు అయినప్పటికీ జీవిత సమస్యలపట్ల ఆధునిక దృక్పథం గల మూర్తి వివేకానందుడు. భూత వర్తమానాల దేశ పరిస్థితులు కతను ఒక వంతెనలాంటివాడు. అతనొక సుందర సగర్వమూర్తి తన ఉనికి, శీలము, ప్రభావ పూరితమైనవి. తనలోను, తను చెప్పే సందేశంలోను సంపూర్ణ బల విశ్వాసాలు గల చైతన్య మూర్తి, శక్తిశాలి, అయిన వివేకానందునిలో దేశాన్ని పురోగమింప చేయగల అపూర్వ శక్తి సంపన్నత ఉన్నది. నైతిక పతనం పొందిన, అణగారిపోయిన హిందూ ప్రజల తత్వానికాయన ఔషధంలా వచ్చి దానికి భూతకాలంలో వేళ్ళు గల ఉనికిని, ఆత్మవిశ్వాసాన్ని యిచ్చాడు." అని శ్రీ నెహ్రూ 'డిస్కవరీ ఆఫ్ ఇండియా'లో పేర్కొన్నాడు. వివేకానందుడు ముప్పైతొమ్మిది సంవత్సరాల ఉజ్వల జీవితకాలంలోనే 'ఉత్తిష్ఠత, జాగ్రత్త' అని జాతిని మేల్కొల్పాడు. దేశానికి సరిపోయే జాతీయ అంతర్జాతీయ తత్వాన్ని ప్రకాశంలోకి–ప్రచారంలో గల ప్రాచీన తత్వం లోనించే– తెగలిగిన చైతన్య మూర్తి వివేకానందుని కంచు విగ్రహాన్ని జూలై 12న భారత రాష్ట్రపతి మద్రాసు మెరీనా సముద్ర తీరంలో ఆవిష్కరించారు. విగ్రహాల ప్రతిష్ఠను కాదనే ఆధునికులైనా ఇలాంటి నారి విగ్రహాల కల్పబడినప్పుడు ఆ సన్నిబోధనలు, ఆ 'విప్లవ' మూర్తి జీవితమూ తెల్సుకోగల కుతూహలం కలిగినట్లయితే మహాపురుషుల విగ్రహాల ప్రతిష్ఠ నగర చౌరస్తాలకు కేవలం అలంకారం కాదని, 'జాతి'కి చరిత్రలో గల సందేశాన్ని చరిత్రలోనే వెతుక్కోమని చెప్పడం కాగలదని అనుకోవచ్చును. "ఆత్మవిశ్వాసం లేని ఆస్తికునికన్నా ఆత్మవిశ్వాసం గల నాస్తికుడు మేలు" అంటాడు వివేకానంద స్వామి. శ్రీ నెహ్రూమీద యీ మహాని యుని జీవిత చరిత్ర; బోధన; 'పురోగామిదృక్పథం' చాలా ప్రభావం చూపించా యన్నది "డిస్కవరీ ఆఫ్ ఇండియా" చదివే వాళ్ళందరికీ తోస్తుంది.

# సరాగమాల — వి.ఎ.కె. రంగారావు

శ్రీకాకుళం నుంచి పేరివ్వని పాఠకుడు వ్రాసిన కార్డు.

"ఆంధ్ర పత్రికను చాలా కాలంనుండి చదివే వాళ్లలో నేనొకణ్ణి. 'సరాగమాలను' మీరు ప్రవేశ పెట్టడం ఆ మధ్యనే జరిగింది. ఈ సరాగమాల చదివేవాళ్లు చాల తక్కువ, కాగా చదివేవాళ్లకు కూడా బోరు కొడ్తుంది ఆ శీర్షికలో, పాటలు, రికార్డుల నంబర్లు చూస్తుంటే అది ఒకశీర్షిక అనేదానికన్న ఒక ఎడ్వర్‌టైజమెంట్ అంటే సరిపోతుంది శ్రీ వి ఎ కె రంగారావుగారి టూరు ప్రోగ్రాములు వారి షాపుల సందర్శనం చూస్తూంటే ఇదేదో సేల్సు ఏజంటు పబ్లిసిటీ లాగున్నది. ఆ మధ్య కొందరు పాఠకులకు ఇచ్చే (వి ఎ కే. గారి) జవాబులు చూస్తొంటే చాల అసహ్యమనిపించింది ఇప్పుడైనా ఈ చెత్త శీర్షికను ఆపమని ప్రార్థన"

గోగినేనిపురాస్థానకవియైన బులుసు అష్టావధాని ఆశువుగా చెప్పిన పద్యము.

శా॥ రాధా మాధవ ప్రేమ తత్త్వముల నారాధించి చిత్రావళి
గాథాగాన మనోహరంబులను యోగ్యం బొప్పగా పత్రికల్
తాధర్మంబున బాటగా రచనలన్ తర్కించు విజ్ఞాని నీ
సాధుత్వం బభినందనీయమగు వెంచన్ రంగరాయాగ్రణీ!

పూర్వకవి సుభాషితము:

ఆత్మ విశ్వాసంబున తమ కార్యంబు ఘటియించు వారికి దూషణభూషణములు ప్రజాభిప్రాయమనే నాణెమునకున్నటువంటి ఇరు ప్రక్కలు:

* * *

రామినీడు ఇంతవరకు దర్శకత్వం వహించిన చిత్రాలు నాలుగు "మా ఇంటి మహాలక్ష్మి", "చివరికి మిగిలేది," కలిమిలేములు", "అనురాగం" ఈ నాలుగు చిత్రాలలోనూ మల్లాది కవితా మాధురి, "ఆమని ఏమాయామిని," "అందానికి అందం నేనే" "కొమ్మలమీద కోతి కొమ్మచ్చులాడింది" "పచ్చజాతి తీగలోయ్ సంపెంగపూవులోయ్" రూపేణ ప్రవహించింది ఇప్పుడు రామినీడు తీస్తున్న చిత్రం "పల్నాటి వీరకథ" కోసం మొన్ననే ఒక పాట మల్లాది వ్రాశారు బాల చంద్రుని జననోత్సవం సందర్భం.

"వెలుగొచ్చెనే లేత వెలుగొచ్చెనే
కలవారిలోగిలికి కళవచ్చెనే పండు కళవచ్చెన్
తెలిజేజె సిగపూవు దిగి వచ్చెనే"

తెలుగు నుడికారంపై ఆ ప్రభావం గమనించండి! ఎవరికుంటుందది? ఉన్నా ఒక సినిమా పాటలో ఆ ఆఖరి వాక్యం వ్రాయటానికి ఎంత మంది సాహసిస్తారు. ప్రజాదరణ కోసం ఐదేళ్ల పసివాళ్లకు అలవడే వరస అర్థమయ్యే మాటలు వాడుతున్న ఈ రోజుల్లో!

* * *

ఆగస్టు మూడవతేదీన రాత్రి తొమ్మిదిన్నర గంటలకు మద్రాసునుంచి ఆకాశవాణిలో "ప్రణయ బృందావని" అనే సంగీత రూపకం ప్రసారమవుతుంది. విని ఎలా ఉన్నదో నాకు వ్రాయండి నాకు వ్రాయట మెందుకూ అని ఆలోచిస్తున్నారేమో! ఆ రూపకంలో వచన రచన నాది. పాటలు ఆనందకుమార్‌ని సంగీత ఛాయలు చిట్టిబాబువి. దీని వెనకనున్న ప్రోత్సాహోత్సాహాలు దాశరథివి రాధామాధవ గాథా మాధుర్యంలో శత సహస్రాంశం ప్రతిబింబించ ప్రయత్నించు ఆ రూపకానికి మృదుమార్దవ వాచకాన్ని జోడించేదెవరు?! మీకు ఆ రోజే తెలుస్తుంది.

* * *

మనకున్న కొద్ది మంది పాడే తారల్లో ఎస్ వరలక్ష్మిది ముఖ్యస్థానం సాధారణంగా ఆమె నటించే ప్రతి తెలుగు చిత్రంలోను కనీసం ఒక పాటయినా ఉండక పోదు ఆ ఒక్కటీ కర్ణాట ప్రియులను రస తన్మయులను గావించక మానదు. "వీరపాండ్య కట్టబ్రహ్మన" లో "విజయవరదాయకా," "చిన్నారి తల్లి", "మహామంత్రి తిమ్మరుసు" లో "శ్రీలాకృష్ణ", "తిరుమల తిరుపతి వెంకటేశ్వర" విన్నవారెవ్వరూ ఈనాటికీమరచి ఉండరనే నావూహ. ఆమె ఇప్పుడు నటిస్తున్న చిత్రాలలో పాటల రీత్యా ముఖ్యమైనది "బభ్రువాహన" ఇందులో "ఏమని తానాడునో" అన్న ఏకస్వర గీతం, "సినరి మనోహరి" అన్న యుగళ గీతం, "వర్ధిల్లు మా పాప వర్ధిల్లుమయ్యా", "మాసాటి వారు యేచోట లేరు" అను రెండు బృందగీతాలు వరలక్ష్మివి ఉన్నవి ఇవన్నీ పామర్తి చేసినవి మొదటిది హిందూస్థానీ పద్ధతిలో అతి మనోహరంగా ఉన్నదని విన్నాను కాని పాటను వినలేదు. విన్న పద్యాలన్నీ, పద్యాలు సాధారణంగా నచ్చని నాకు చాలా బాగా ఉన్నవి. ముఖ్యంగా సుశీల శహానాలో పాడిన పద్యం. ఇందులో కొన్ని పద్యాలు విజయ విలాసం లోనివి మిగిలిన పాటలు, పద్యాలు సీనియర్ వ్రాసినవి.

పామర్తి మొదటి చిత్రం "సతితులసి". ఇందులో వరలక్ష్మి పాడిన పాటలతో బాటు "నన్నే పెండ్లాడవలె", "ఆతలో చేరినాడు" పాటలూ కొందరికి గుర్తు ఉండే ఉంటాయి వాటితో బాటే "శ్రీ తిరుపతమ్మ కథ"లో "కౌగిలి కైలాసము" అన్నది

"బభ్రువాహ"నే నా ఆశయం ప్రకారం బ్రహ్మాండమైన హిట్టయితే (ఇలా కోరటానికి కారణం కూడా ఈ ఒక్కటే) శాస్త్రీయ సంగీతానికి మళ్లీ చిత్రాలలో పలుకుబడి హెచ్చుతుంది. రోలూ రోకళ్ల దంపుళ్లు తక్కువవుతాయి

వరలక్ష్మి నటిస్తున్న తక్కిన చిత్రాలు "హరిశ్చంద్ర" "వీరాభిమన్య". చంద్రమతిగా నాలుగైదు పద్యాలు, రెండు పాటలు ఉంటాయని తెలుస్తున్నది. రెండవ చిత్రంలో సుభద్రగా పాటలు లేకపోవచ్చు అంటున్నారు.

* * *

సుగంధి వారు పెండ్యాల సంగీత దర్శకత్వంలో "గ్రామ దేవతలు"ను అద్వితీయ సంగీత చిత్రంగా రూపొందించ ప్రయత్నిస్తున్నారు. మొన్న నాలుగు పాటలు విన్నాను. అందులో రెండు చాలా హాయిగా ఉన్నవి. పి. లీల పాడిన "కోమల పల్లవపాణి" దేవగాంధారిలో దివ్యంగా ఉంది. ఘంటసాల— జేసుదాస్ పాడిన సరదా గీతం చాలాకీ గమ్మత్తులతో చిలిపిగా ఉంది.

ఈ చిత్రంలో మరొక ప్రత్యేకత. పైన పల్లవి ఉదహరించిన పాట కీర్తిశేషులైన శ్రీమతి సుగంధి కుంతలాంబ (నిర్మాత తల్లి) వ్రాసినది.



'డాక్టర్ చక్రవర్తి'లో సావిత్రి

ఈ చిత్రంతో పరిచయం కాబోతున్న మరొక కొత్త రచయిత వసంత (వర్ధమాని పార్థసారథి). ఇందులో ఒక కామెడీ పాట వ్రాశారు. వసంత చిత్రసీమకు కొత్తయినా రేడియోకు పాతకాపే. వీరు వ్రాసిన "హిమము కురిసే వేళ తమము విరిసే వేళ" శ్రీరంగం గోపాలరత్నం పాడగా విని పరవశులైన వారు యెందరో ఉన్నారు. ఈ రెండు పాటలనే యెందుకు ఉదహరించానంటే, మొదటిది సంగీత సాహిత్యాల దృష్ట్యా ఉత్తమమైనది. రెండవది ప్రజాదరణ పొందటానికి అన్ని హంగులూ కలిగి ఉన్నది.

సినిమా పాటల రచనలో ఆ ద్వితీయ దీప్తులుగా ప్రకాశిస్తున్న వది వెలుగులలో రెండు మల్లాది, ఆత్రేయ. మల్లాది వచనం వ్రాసినా గీతంలా ఉంటుందనీ, ఆత్రేయ పాట వ్రాసినా వాక్యంలా ఉంటుందనీ కొందరి అభిప్రాయం. ఇది ఆరోపణ కాదు. ఆ దృష్టిలో చూస్తే అంటే మల్లాది వ్రాసిన ప్రతి వాక్యంలో ప్రతి అక్షరంలో కొందరు పాటలలోనే అరుదుగా సాధించ గలిగిన అందం ఉంటుందనీ, ఆత్రేయ పాటలలో ప్రతి పాదం ఉత్తమ వాక్యమంత అర్థయుక్తంగా ఉంటుందనీ, నేనూ యేకీభవించక తప్పదు. ఇది ఉపోద్ఘాతము.

"డా. చక్రవర్తి"లో ఆత్రేయ వ్రాసిన నాలుగు పాటలు ఉన్నవి. మూడు సుశీలవి, ఒకటి ఘంటసాలది. ఈ నాలుగూ ఒక్కో విధమైన అభిరుచి ఉన్నవారికి నచ్చుతయి. ఒకటి మాత్రం యెంతో మందిని యిట్టే ఆకర్షిస్తుంది. ఇది నాంది.

శృంగార మార్గంలో కవితను పయనింప జేయాలనుకున్న వారికి యెన్నో వస్తువులున్నవి. అందులో ఉత్తమోత్తమమైనది- అన్నిటిని అందులో ఒక భాగంగా కలిగినది రాధామాధవ ప్రేమ తత్వము. అటువంటి మహనీయమైన వస్తువు జగన్మోహనము. ఇది ప్రస్తావన.

> నీవు లేక వీణ పలుకలేనన్నది
> నీవు రాక రాధ నిలువలేనన్నది
> జాజి పూలు నీకై రోజురోజు పూచె
> చూచిచూచి పాపం సొమ్మసిల్లి పోయె
> చందమామ నీకై తొంగి తొంగి చూచి
> సరసను లేవని అలకలు పోయె
> కలలనైన నిన్ను కనుల జూతమన్న
> నిదురరాని నాకు కలలు కూడ రావే
> కదలలేని కాలం విరహగీతి రీతి
> పరువము వృథగా బరువుగా సాగె
> తలుపులన్ని నీకై తెరచి ఉంచినాను
> తలపులెన్నో మదిలో దాచి వేచినాను
> తాపమింక నేను ఓపలేను స్వామీ
> తరుణిని కరుణను ఏలగరావా

పై పాటను పాడినది సుశీల. ఈ ఒక్క పాటలో సుశీల మరొక వ్యక్తిని పూర్తిగా అనుకరించి పాడటానికి ప్రయత్నించి చాలమట్టుకు కృతకృత్యురాలయింది. ఆ వ్యక్తి రాధ. రాజేశ్వరరావు సరస. రెండవ మారు పరికిస్తే ఆత్రేయ రచన ఈ రెంటిటిలో కూడ శాస్త్రీయ పద్ధతికి దగ్గర వుండేట్లు చేసిన ప్రయత్నం కనబడుతున్నది. కాని ఈ ప్రయత్నం ఆ పాటను పేలవం చేయలేదు. స్థాయిని అంతగా తగ్గించలేదు. కేవలం ఆనందించే వారి సంఖ్యను యెక్కువ చేసినది. ఇది వ్యాఖ్య.

**ఈ పాట విన్నవారికి ఆనందమూ, అందాన్ని** అనుభవించటంలో ఉన్న సుఖమూ విశదమవుతుంది. ఈ అనుభవాన్నే పదేపదే కోరుకున్నట్లు చేస్తుంది. ఇది ఫలశ్రుతి.

వలపు రంగన్నా, చంద్రుడన్నా యెక్కువ మక్కువ ఉన్నవారికి కృష్ణ చంద్రశేఖరుడంటే యెంత ప్రేమ కలుగుతుంది! ఆ ప్రేమ పండుకున్న మూర్తికి ఇది అంకితము.

పాట పాడిన వారికీ, చేసిన వారికి, వ్రాసిన వారికీ, విన్నవారికీ మంగళము. రికార్డు నంబరు ఎన్. 69814 ఇది మంగళాశాసనమ్. ★



'సంగమ్'లో వైజయంతిమాల, రాజేంద్రకుమార్.



'గ్రామదేవతలు'లో రాజసులోచన, చలం.

# మద్రాస్ సినీమా వార్తలు

## తేనె మనసులు

లోగడ 'మంచి మనసులు', 'మూగ మనసులు' చిత్రాలను ఆంధ్ర ప్రేక్షక లోకానికి అందించి, బాబూ మూవీస్ వారు అందరూ కొత్త నటీ నటులతో "తేనె మనసులు" చిత్రాన్ని నిర్మించ టానికి సన్నాహాలు చేస్తున్న విషయం పాఠకు లకు తెలిసిందే.

హైదరాబాదులో నిర్మింపబడనున్న ఈ చిత్రా కొత్తవారల ఎన్నికను పూర్తిచేశారు. ప్రధాన పాత్ర లన్నింటినీ కొత్తనటులే పోషించటం ఈ చిత్రంలోని ప్రత్యేకత. తెనాలికి చెందిన శ్రీ జి. కృష్ణ, హైదరాబాదులో ఉంటున్న శ్రీ మోహన్‌లను నాయక పాత్రంకు, నాయికా పాత్రలకు విజయవాడకు చెందిన పి. సంధ్యారాణి, రాజమండ్రికి చెందిన సుకన్యలను ఎన్నికచేయుటం జరిగిందని అధికారరీత్యా తెలిసింది. ఇంకా పి. వెంకటేశ్వరరావు (విజయవాడ), పుష్పకుమారి (గుడివాడ), యం. వి. చలపతిరావు (విజయవాడ), కోనేశ్వరరావు (విజయవాడ), వాణీబాల (మచిలీ పట్నం), జి. యస్. ఆర్. మూర్తి (విజయవాడ), బేబీరోజారాణి గారలు కూడా సహాయ పాత్రలకు ఎన్నికయ్యారు.

ఈ చిత్రానికి శ్రీ ఆదుర్తి సుబ్బారావు దర్శ కత్వం వహిస్తున్నారు. కొత్త నటుల దరఖాస్తులు, ఫోటోలు కోకొల్లలుగా వచ్చాయి. అబ్బాయిలు, అమ్మాయిల కన్నా ఎక్కువ ఆసక్తి చూపారట! అందువల్ల అబ్బాయిల వద్ద నుంచి నాలుగువేల దరఖాస్తులు వచ్చాయిట. మరొవైపు 125 మంది అమ్మాయిలు మాత్రం దరఖాస్తులు పంపారట!

* * *

'పల్నాటి వీరకథ' చారిత్రాత్మక చిత్రాన్ని నిర్మించేందుకు అనురూపా చిత్రవారు చురుకుగా ఏర్పాటు చేస్తున్నారు. ఇటీవలనే దర్శకులు శ్రీ రామినీడు తదితరులు గుంటూరుజిల్లాలో కొన్ని ప్రాంతాలకు వెళ్ళి, ఈ చరిత్రాత్మక చిత్రా నికి అనువైన ప్రదేశాలు ఎక్కడెక్కడ ఉన్నాయో పరిశీలించి వచ్చారు.



'మ.రాంబీ'లో మధుబాల, దేవానంద్.

ఈ చిత్రంలో శ్రీ ఎన్. టి. రామారావు భానుమతి గారలు ప్రధాన పాత్రలను పోషించగలరని విశ్వసనీయంగా తెలుస్తున్నది. గుమ్మడి, కాంతా రావులు కూడా నటించనున్నారు.

లోగడ విశేషంగా జానపద చిత్రాలను నిర్మించిన శ్రీ విఠలాచార్యా ఈమారు నిర్మించనున్న చిత్రంలో నాయక పాత్రకు శ్రీ ఎన్. టి. రామారావును ఎన్నిక చేసికొన్నట్లు తెలుస్తున్నది. ఈ చిత్రానికి "అగ్గిపిడుగు" అని నామకరణం చేశారు. వాహినీ స్టూడియోలో షూటింగు కొనసాగుతోంది. ఆగస్టు ప్రాంతంలో చిత్రాన్ని విడుదల చేసేం దుకు ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

## 'మంచి మనిషి'

ఛాయా చిత్రవారు నిర్మిస్తున్న ప్రథమ చిత్రం సాంఘికం. ఈ చిత్రానికి "మంచి మనిషి" అని నామకరణం చేశారు.

మనిషి మంచివాడు అవటానికి పుట్టుకా—లేక—పరిస్థితులు చుట్టూఉన్న వాతావరణమా అన్న సమస్యపై చిత్రీకరిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు కె. ప్రత్యగాత్మ. రచన— పినిసెట్టి శ్రీరామమూర్తి.

ఈ చిత్రంలో ఎన్.టి. రామారావు, జమున, జగ్గయ్య, గుమ్మడి, పద్మనాభం, హేమలత, గీతాంజలి రాజబాబు, మిక్కిలినేని, గెస్టు ఆర్టిస్టుగా బాలయ్య నటిస్తున్నారు.

ఈ చిత్రానికి సంగీత దర్శకులు యస్. రాజేశ్వర రావు అండ్ టి. చలపతిరావు. ఈ మధ్య పిఠాపురం నాగేశ్వరరావు, మాధవపెద్ది సత్యం ప్రాధాన్యంతో అంతా మగవాళ్ళతో ఒకకోరస్ పాటను రికార్డు చేశారు. ఈ పాటను కొసరాజు రాఘవయ్య చౌదరి వ్రాశారు.

ఈ చిత్రానికి ఇంకా శ్రీశ్రీ, దాశరథి, సి. నారా యణరెడ్డి పాటలు వ్రాశారు. ఛాయ. యం.కె. రాజు, కళ—యస్. కృష్ణారావు, కూర్పు—సంజీవి, స్టుడియో—వాహినీ, నిర్మాత. కె. సుబ్బరాజు.

## సినీనటుడు యస్. వి. రంగా రావుకు ఏలూరులో సన్మానం

జకర్తా ఫిలిం ఉత్సవాలలో ఉత్తమ నటుడుగా వచ్చిన శ్రీ యస్.వి. రంగారావుకు ఈ మధ్య ఏలూరు లో అఖండమైన సన్మానం జరిగింది. 27 జతల ఎడ్లను ఒక అలంకరింపబడిన ట్రక్కుకట్టి, ఒక్కొక్క జత ఎడ్లకు ఒక్కొక్క పాశ్చాత్య దేశపు పేర్లతో బోర్డులు కట్టి, అలంకరింపబడిన ఆ ట్రక్కు పైన నటుడు యస్.వి. రంగారావును స్థానిక మున్సిపల్ చైర్మన్, ఎం. ఎల్. ఏ. ఆంధ్రప్రదేశ్ మంత్రి అయిన శ్రీ తోటరామస్వామి గార్ని కూర్చోబెట్టి పురవీధులలో ఊరేగించారు. శ్రీ రామస్వామి గారే అధ్యక్షత వహించారు. స్థానిక పెద్దలు చాలమంది శ్రీ రంగారావు నటనా కౌశల్యాన్ని కొనియాడుతూ మాట్లాడారు. పట్టు శాలువను శ్రీ రంగారావుకు సమర్పించారు.

స్థానికంగా, ఇంకా చుట్టు ప్రక్కల ప్రదేశాల నుండి 50 పైగా సన్మాన పత్రాలు అనేక సమాజాల వారు సమర్పించారు. 200 పైగా టెలిగ్రాంల ద్వారా శుభాకాంక్షలు సభామండపానికి వచ్చాయి.

చెబుతూ ఈ సన్మానం జరిపించిన వారికి, హాజరైన జనానికి, పెద్దలకు శ్రేయోభిలాషులకు తన కృతజ్ఞతను తెలియజేశారు. తర్వాత అధ్యక్షులు చివరి పలుకులు మాట్లాడేరు. జనగణమనతో సన్మాన సభ జయప్రదంగా ముగిసింది.

## "బభ్రువాహన"

చిత్ర అర్జునుని వద్దకు పోయి పుత్రభిక్ష పెట్ట వలసిందిగా కోరటానికి వచ్చింది.

"ఎవరు నువ్వు?"

"యాచకురాలిని!"

"నిశీథివేళ మేలిముసుగులో ముఖం దాచుకుని యాచించే అవసరం?"

"పరుల కంట కనబడకుండా ఆశ్రయించాలని వచ్చాను."

"అఁ! ఏం కావాలి!"

"పుత్ర భిక్ష ప్రసాదించండి!"

"వెర్రిదానివలెనున్నావు. రారాని చోటికి వచ్చి అడుగరాని వరం అడుగుతున్నావు. ఈ నరుడలాంటి వాడు కాదు"

"నాకు తెలుసు! నా కుమారుని రక్షించగల ధీరులు మీరే! నా ప్రార్థన నిరాకరించకండి!"

అంటూ చిత్ర తన ముసుగు తొలగిస్తుంది అర్జునుడు ఆశ్చర్యంతో. —

"ఆ! చిత్రాంగదాదేవి!"

"మీరే దిక్కని నమ్ముకున్న దాసిని"

"అవమానం సహించని అభిమానవంతురాలవు—తండ్రికైనా తలవంచని కుమారుని కన్న వీరమాతవు! ఈ రహస్యం తెలిస్తే కొడుకు నీ మీద కూడ కత్తి దూయగలడు సుమా!"

"ఇంకా మీ కోసం చల్లారలేదా స్వామి! ఆ చిరంజీవి అపరాధానికి నేను క్షమాపణ కోరుతున్నాను—నా ముఖం చూచైనా వాణ్ణి మన్నించండి! సమరం సంఘటిల్లకుండా చేయండి!"

"మాతృ హృదయంతో మాట్లాడుతున్నావేకాని మగవాని వలె మాటాడ్డం లేదు—చిత్రా! ఆశించిన దొకటి, అయినది వేరొకటి! కురువంశ పౌరుషానికి ఇది సమయం! ఎవరు తలవంచినా అవమానమే—సమరం సాగించక తప్పదు."

"అంతేనా స్వామీ! తమను మించిన కుమారుడు కలుగుతాడని దీవించారే! మీ ఇరువురి సమావేశం చూసి మురిసి పోవాలని ముచ్చట పడ్డానే! నేకన్న కలలకు ఫలితం ఈ పగలూ పంతాలేనా? మీరైనా నా మాట మన్నిస్తారని వచ్చాను నిరాకరిస్తారా? కన్న కుమారుణ్ణి మీ గాండీవానికి బలి చేస్తారా?"

"కన్నీటితో మా హృదయం కలిగించి మాధర నిర్వహణానికి అడ్డు రాకు నేనే జయించి, కుమారుడు ప్రాణాలతో నా చేజిక్కితే వధించను ఎవరు గెలిచినా గౌరవం నీదే!"

"స్వామీ! నాకు రెండు కన్నులూ కావాలి! పక్షంధురాలిని చెయ్యకండి!"

"దైవేచ్ఛ! పరులకంట బడితే పరువుండదు—వెళ్ళు!" అని చిత్రాంగదను అర్జునుడు పంపి వేస్తాడు

ఈ సన్నివేశం ఎన్ ఎస్ ఏ పి వారి "బభ్రువాహన" చిత్రంలోనిది దీనిలో అర్జునుడుగా యన్.టి. రామా



'హంతకుడెవరు' చిత్రంలో బి. సరోజాదేవి



'శ్రీ సింహాచలక్షేత్ర మహిమ'లో కృష్ణకుమారి.



'మంచి మనిషి'లో రామారావు, జగ్గయ్య.

రావు, చిత్రాంగదగా యస్. వరలక్ష్మి పాల్గొన్నారు.

వీరుగాక ఇంకా ఈ చిత్రంలో కాంతారావు, రేలంగి, చలం, పేకేటి, మిక్కిలినేని, వంగర, అలు రామలింగయ్య రాజసులోచన, యల్. విజయలక్ష్మి మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన—దర్శకత్వం— సముద్రాల రామానుజాచార్య నిర్మాత సి. జగన్మోహన రావు.

సి. ధర్మారావు. ★



# అవీ - ఇవీ - అన్నీ

## మద్రాస్ అడ్వార్ టయిజ్ మెంట్ క్లబ్

1964—65 సం.నికి గాను మద్రాసు అడ్వర్టయిజ్ మెంట్ క్లబ్ అధ్యక్షునిగా శ్రీ పి. జి. కె. రెడ్డిని, ఉపాధ్యక్షునిగా శ్రీ ఉమేష్‌రావుని ఎన్నుకున్నది. కోశాధికారిగా శ్రీ ఎ. కె. నాగలింగం కార్యదర్శులుగా శ్రీయుతులు టి. జగన్నాథన్, ఆర్. నరసింహన్‌లు ఎన్నుకోబడ్డారు.

*　　*　　*

ఇటీవలనే మద్రాసులో జరిగిన స్కూల్ ఆఫ్ సోషల్ వర్కు వారి సెమినార్ సదంర్భంలో విశాఖపట్నానికి చెందిన కుమారి జయలక్ష్మి భరతనాట్య ప్రదర్శన ఇచ్చింది. ఇంగ్లీషు, తెలుగు, హిందీ, కన్నడ భాషలు తెలిసిన ఈ అమ్మాయి పి.యు.సి. చదువుతున్నది. ఈ సెమినార్‌లో పాల్గొనటానికి ఆంధ్ర. కేరళ ప్రాంతాలనుంచి ప్రతినిధులు వచ్చారు.

## స్వీకారం

తెలుగు సినిమా తారలు, దర్శకులు, సంస్థలకు సంబంధించిన వివరాలను తెలిపే శ్రీ గోటేటిగారి "తెలుగు సినిమా" పుస్తకం మా కార్యాలయానికి



'బభ్రువాహన'లో బభ్రువాహనుడుగా చలం.



'అగ్గిపిడుగు'లో జయంతి.

చేరింది. వెల : రెండు రూపాయలు. తిరువేంకట ప్రచురణ. ప్రతులకు, 27 భజనకోయిల్ వీధి, టి. నగర్, మద్రాసు 17.

*　　*　　*

శ్రీ వి. ఎస్. అవధాని రచన—శార్వాణి సాంఘిక నవల మా కార్యాలయం చేరింది. వెల : 200 పైసలు. ప్రతులకు : క్రాంతి పబ్లికేషన్స్, 70, పెరియన్న మొదలివీధి, మద్రాసు—1.

*　　*　　*

'అదృష్టహీనులు' నవల—రచన: శ్రీ కొయ్యే జగ్గయ్య. 'పూర్వభాగం' తో రచన ప్రారంభమవుతుంది. మంచి గెటప్ నూరు పుటలు గల దీనివెల : ఒక రూపాయి. ప్రతులకు : కె. జగ్గయ్య, ప్రకాశరావుపేట, విశాఖపట్నం—2 కి వ్రాయుచ్చు.

*　　*　　*

అమరసాహితి, గోషామహల్, హైదరాబాదువారి ప్రచురణ 'రాత్రి' కవితా సంకలనం మా కార్యాలయం చేరింది. శ్రీ అడపా శివాజినాయుడు సంపాదకత్వాన వెలువడిన యీ పుస్తకంలో ఆధునిక కవితకు సంబంధించిన పలువురి కవితలున్నాయి. మూల్యం : రు. 1—50 పై.

## కొత్త పత్రిక

ఆంధ్రప్రదేశ్ ఫిలింఫాన్సు అసోసియేషన్ తరఫున "ఫిలింఫాన్" అనే పక్షపత్రికను త్వరలో విజయవాడ నుంచి ప్రచురించడానికి సన్నాహాలు జరుగుతున్నవి.

*　　*　　*

పలువురు ప్రముఖులు ఉపవిష్టులైన సమావేశంలో ఇటీవలనే బొంబాయిలోని భూలాభాయి స్మారక మందిరంలో శ్రీ దాదా రామనాథ శాస్త్రి వాట్యావధానం చేశారు. ★

# కామరాజ్

7 వ పేజీ తరువాయి

స్వాగతం ఇవ్వటానికి వచ్చిన ప్రముఖులలో .... ఒకరా, ఇద్దరా .... పలువు రున్నారు. కేంద్ర ఉప మంత్రి శ్రీ పి. ఆర్. పట్టాభిరామన్ అందులో ఒకరు. ముఖ్యమంత్రి ఎం. భక్తవత్సలం, చిత్ర నిర్మాతలు ఎస్. ఎస్. వాసన్, ఎ. వి. మెయ్యప్ప చెట్టియార్, ఎం. ఆర్. రాధ, జెమినిగణేశ్, తమిళ జాతీయపక్షం నాయకులు ఇ. వి. కె. సంపత్, ఎస్. ఆందోనిపిళ్ళై, స్థానిక కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కృష్ణస్వామి ప్రభృతులున్నారు.

* * *

ఆనాటి రాత్రి 'బ్రాడ్వే' లో జరిగిన బహిరంగ సభ కూడా పూర్తిగా, శ్రీ కామరాజు జౌన్నత్యాన్నే విశదీకరిస్తుంది. ఇసుకవేస్తే రాలనంతగా వచ్చారు ప్రజలు.

బహిరంగసభ కూడా హుందాగా జరిగింది. కేంద్ర మంత్రులు సంజీవరెడ్డి, సి. సుబ్రహ్మణ్యం, ముఖ్యమంత్రి భక్తవత్సలం ప్రభృతులు వక్తలు.

శ్రీ కామరాజును గురించి శ్రీ సుబ్రహ్మణ్యం చెప్పిన మాటలు బావున్నాయి. "తనను చూచి గట్టిగా నవ్వుకోవగలిగిన వ్యక్తి కామరాజు" అన్న సుబ్రహ్మణ్యంగారి మాటలకు శ్రీ కామరాజు నిజంగానే ఫక్కుమని నవ్వారు. మరో చిత్రమైన సంఘటనను కూడా యీ సందర్భంలో చెప్పుకోవటం జరిగింది. అమెరికా ప్రజాస్వామ్య నాయకులు అడ్లాయ్ స్టీవెన్సన్ ఒకమారు ఇండియాను సందర్శించి, తిరిగి వెళ్ళుతూ వెళ్ళుతూ తనకు నచ్చిన ఇద్దరే ఇద్దరు ముఖ్యమంత్రులలో శ్రీ కామరాజ్ ఒకరన్నారట. ఈ సంగతి శ్రీ కామరాజ్‌కు చెప్పగానే, ఆయన ఉప్పొంగిపోయి, ఒళ్ళు మైమరచి, తల క్రిందులుగా నృత్యం చేయలేదుట. కాగా, 'ఎవరా స్టీవెన్సన్' అని అడిగారట. ఇది నిజంగా చిత్రమే ననిపిస్తుంది విన్నవాళ్లకు, కన్నవాళ్లకు.

శ్రీ కామరాజ్‌కు అసలు ఇంగ్లీషు రాదనే అపప్రథను శ్రీ భక్తవత్సలం తొలగించారు. ఇది కేవలం వదంతి మాత్రమేనని చెపుతూ, శ్రీ కామరాజ్ ఈనాడు "తడుముకోకుండా" ఇంగ్లీషు మాట్లాడగలరని, హిందీ కూడా కొంచెం కొంచెం వచ్చునని అన్నారు. ఇంతలో శ్రీ సంజీవరెడ్డి "ఆయనకు తెలుగు కూడా వచ్చు. మనం చెప్పేదేదో అర్థంచేసుకొంటారు" అనేసరికి సభ మరొకమారు ఫక్కుమని నవ్వింది.

ఆనాటి బహిరంగసభంతా సరదాగా, కులాసాగా జరిగింది. శ్రీ కామరాజ్ తమ సహజ ధోరణిలో గంభీరోపన్యాసం చేశారు. ఆంధ్రప్రదేశ్ ఆరోగ్యమంత్రి శ్రీ శివరామప్రసాద్‌గారి కుమారుడు శ్రీ వై. ఎ. ప్రసాద్ శ్రీ కామరాజుకు రు. 10,001 లు బహూకరించి "ఆయన ఇష్టం వచ్చినట్లుగా — వినియోగించమని" కోరటమూ, "భువనేశ్వర్ కాంగ్రెసు"మీద 'అరుణ్' రచించిన పుస్తకాన్ని మద్రాసు పత్రికమల మంత్రి శ్రీ వెంకట్రామన్ ఆవిష్కరించటం, ఈ సభలోని మరి కొన్ని విశేషాలు.

ఇలాంటి వెన్నో సత్కారాలు, సన్మానాలు శ్రీ కామరాజుకు జరుగుతూనే ఉన్నాయి. వారి

...మృదినోత్సవాన్ని అత్యంత వైభవంగా మద్రాసు ప్రజానీకం జరుపుకొంటున్నది.

ఇంతటి అపూర్వ సత్కారం జరుగుతున్నా ఆయన తబ్బిబ్బు అయిపోలేదు. ఎప్పటిలాగే నిరాడంబరంగానే కనుపించాడు. ఆయన హృదయమూ ఎప్పటిలా నిష్కల్మషంగానే ఉంది. ఆయన నిగర్వి.

ఈ మహా సంరంభం చూశాక, కాంగ్రెసు రిన్థ సారధిగా ఆయన్ను ఇప్పట్లో కాదనగలిగేవారూ లేరనిపిస్తుంది! ★

## నర్లేకర్

11 వ పేజీ తరువాయి

...వమవుతున్నట్లుగానే, కొన్ని పరిస్థితులలో హోయిల్ నర్లేకర్ సమీకరణాలు ఐన్‌స్టీన్ సమీకరణాలుగా పర్యవసిస్తాయి. అయితే, 'న్యూటను ప్రతిపాదించిన గురుత్వాకర్షణమునకు 'పేడా బెల్లమూ లేదన్న' విమర్శపైని, దానిని వస్తు సంబార ధర్మముగా కాకుండా విశ్వక్షేత్ర వక్రతా ధర్మపోతే గురుత్వాకర్షణ అనేటిదే ఉండనప్పుడు దానికి వస్తువుతో సంబంధము లేదనడము సరి కాదని, హోయిల్, గురుత్వాకర్షణ అన్నదానిని విశ్వ వస్తు సర్వస్వ ధర్మముగా అన్వయించాడు. ఎన్నడో 1872లో ఎర్నెస్టు మాక్ అన్నాడు "మనకు పరిచితమైన (గురుత్వాకర్షణ వంటి) శక్తుల కున్నా విశ్వ వస్తు సర్వస్వమునకున్నా సుదూర ప్రభావాలు ఉండవచ్చును" అని హోయిల్ నర్లేకర్ సమీకరణాలలో ఈ విశ్వాసము కడతేరుతున్నది. ఈ సమీకరణాల వల్ల హోయిల్ ఇది వరకు సూచించిన 'సృష్టి శక్తి క్షేత్రము' (Creation Filed) నకు వ్యాఖ్యానము కూడా లభిస్తున్నది. ఈ సృష్టి శక్తి క్షేత్రమును ఐన్‌స్టీను సార్వత్రిక సాపేక్షత సమీకరణాలతో జోడించి ఆలోచిస్తే, విశ్వము హఠాద్విస్ఫోటనమువల్ల కాకుండా శాంత ప్రవాహశీలియైన క్రమ పరిణామము వల్లనే ఉద్భవమై వర్ధిల్లుతున్నదన్న హోయిల్ వాదానికి బలము చేకూరుతున్నది.

'ఈ వాదానికి ప్రత్యక్ష సాక్ష్యములేదు' అన్నగుర్తించడానికి సాయపడే ప్రయోగములు (Experiments)లనుకూడా సూచించ బోతారట హోయిల్ నర్లేకరులు.

ఈ సమీకరణాలు క్వాసార్ల సంకోచమును ఏ రీతిగా అడ్డగలవూ ? అని అడుగుతారు పాఠకులు. క్వాసార్ల గర్భములో (విశ్వవ్యాప్తి అయిన) సృష్టి శక్తి క్షేత్రము కూడా అణగారుతూ, ఒక స్థితిలో మరి తాను కుంచించుకోలేక కుంచించుకునే నక్షత్ర ధూమ వస్తువును ఎదురు తన్నుతుందట. కుంచింపునకు సాయపడే గురుత్వాకర్షణ శక్తి, మరి కుంచించ లేక ఎదురుతన్నే సృష్టి శక్తి క్షేత్రమూ పరస్పరము ప్రతిఘటించడములో క్వాసారు స్పందిస్తుండట. క్వాసారు స్పందనాన్ని పట్టగల ఫొటోలు తీయవలసి ఉన్నదన్న మాట. ఆ స్పందనము వల్ల X—కిరణాలు ఉద్భవించవచ్చును. వాటిని పట్టడానికి X'—కిరణ దూరదర్శనులను రాకెట్లలో పంపవచ్చునట ! అస్తు

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి. ★






Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'బభ్రువాహన'లో రామారావు

